


## మీ చర్మానికి తగినది

# నివియా

## ఇదే మీ చర్మానికి కావలసినది

చర్మ - పోషణ చిన్నతనమునుండియే - నివియాతో ప్రారంభించవలెను.
నివియా క్రీములో "యుసిరైట్" - అద్వితీయమైన సహజ ప్రకృతి పదార్థమువంటిది ఉన్నది. రోజూ స్నానంవల్లను, ఎండ, వాన, గాలిలో తిరుగుచుండుట వల్లను గోల్పోవునట్టి మీ చర్మమందలి నమురును అది సమకూర్చుతుంది. మీరు, మీచర్మము కనిపించు నంత యౌవనవంతంగా వుంటారు. మీ చర్మ మంతయు యౌవనయుతమైన ఆరోగ్యవంతంగా వుండుటకు ఖాత తగినది నివియా!

(S&N) నివియా - వివిధోపయుక్తమైన క్రీము

సోల్ డిస్ట్రిబ్యూటర్లు: జె. ఎల్. మారిసన్, సన్ అండ్ జోన్స్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్.,
పోస్టు బాక్సు నం. 1746, బొంబాయి-1.

Alyars C 615

# ఉచితమ్ము

## వైజయంతిమాల క్యాలెండరు




## ప్రతి ఒక్క టినోపాల్ గిఫ్ట్ ప్యాకెట్ తో

సినీతార వైజయంతిమాల మందరవర్ణ ఛాయాచిత్రం... మీ 1966 టినోపాల్ క్యాలెండరుకోసం ప్రత్యేకంగా సాధించబడింది. టినోపాల్ గిఫ్ట్ ప్యాకెట్టును యీ రోజే కొని మీ గృహాలంకరణకు వైజయంతిమాల క్యాలెండరు ఉచితంగా పొందండి. కొంచెము టినోపాల్ వేస్తేనే చాలును. తెల్లనివిగా వున్న బట్ట లన్నింటిని అధికంగా తెలుపు చేస్తుంది. ఒక బట్టకయ్యే ఖర్చు పైసాకంటే తక్కువ।

సమీపంలోని మీ టినోపాల్ డీలరును వైజయంతిమాల క్యాలెండరు అడిగి ఉచితంగా పొందండి—సరకు వున్నంతవరకే।

**టినోపాల్ అన్నింటికన్న అధికంగా తెల్లగా జేయును**



సుహ్రిద్ గైగీ లిమిటెడ్, పో. బా. బాక్సు 965.
టినోపాల్ జె. ఆర్. గైగీ ఎస్. ఎ., బాసిల్, బొంబాయి-1 బాసిల్
స్విట్జర్లాండ్ యొక్క రిజిస్టర్ చేయబడిన ట్రేడ్ మార్కు.

Shilpi SG 133 A. Tel

---

1965 సరికొత్త మోడల్

**ప్రసాద్** (REGD.)

గోల్డెన్ క్యాప్ జర్మన్ పాళీ బాల్ పాయింటు కలములసెట్టు

PRASAD (DISTRIBUTING) AGENCIES
TENALI (A.P.)

---

## రాత్రులందు చదవండి

2 పుస్తకముల సెట్టు రు. 2-50
కొక్కోకశాస్త్రము 84 ఆసనములు (చిత్ర పటములతో) సుహాగ్ రాత్
ఒక్కొక్క పుస్తకం రు. 1—50
పోస్టేజి ప్యాకింగు అదనం.

**ARAHANT BOOK DEPOT.,**
26, ALIGARH (U .P.)

---

## సాధ్యంకానిది ఏదీలేదు



ఇందుకు బహుమతి న్యూట్రీన్ స్వీట్లు అయినపుడు అది మరింత ఆనందకరం




న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ
(ప్రైవేట్) లిమిటెడ్
చిత్తూరు. (ఆం. ప్ర.)

BP-NC-8

# ఎల్ల వేళలలోను

**MODEL 5A46**
6-TUBE 4-BAND AC SET
VARIABLE TONE CONTROL
**Rs. 350**
Excise Duty Rs. 40, Taxes Extra

**MODEL BZ-490** (Portable Set)
9-TRANSISTOR 4-BAND
FINE TUNING
**Rs. 375**
Excise Duty Rs. 40, Taxes Extra

**MODEL BXS-338** (Portable Set)
8-TRANSISTOR 2-BAND
TONE CONTROL
**Rs. 225**
Excise duty Rs. 20, Taxes Extra

**MODEL 7A57'**
2 TONE CONTROLS
5-BAND 7-TUBE
3 SPEAKER HI-FIDELITY AC
**Rs. 575**
Excise Duty Rs. 93.24, Taxes Extra

# షార్ప్ రేడియో మీ జీవితానికి ఆనందాన్ని యిస్తుంది

శక్తివంతమైన మరియు నమ్మకమైన షార్ప్ రేడియోలు గృహములలో ప్రియమైనవి. విచక్షణాపరులైన శ్రోతలకు ఇష్టమైనవి.

సరసమైన ధర మరియు సొగసైన ఆకారము గలిగిన సెట్లని, అందాన్ని మరియు శ్రేష్ఠమైన పనితనాన్ని కోరుకొనేవారు సామాన్యముగా యెన్నుకొంటారు.

నాణ్యమైన వస్తువులను తయారు చేయుటలో ప్రపంచ ఖ్యాతి పొందిన హయాకావా ఎలెక్ట్రిక్ కం. లి., జపాను వారి సాంకేతిక సహాయంతో షార్ప్ రేడియోలు తయారుచేయబడుచున్నవని జ్ఞాపకముంచుకొనండి.




ఇండియన్ ప్లాస్టిక్స్ లి॥ లోటస్ హౌస్, బొంబాయి - 1.

a anta JR/465

# ఉత్తరాలు

## ముఖచిత్రం

4—2—66 వ తేదీ వార పత్రిక చూడగానే నాలో కలిగిన రియాక్షన్ ఏమిటంటే "ఈవారపు ముఖచిత్రం చెత్తగా ఉంది" అని. ఇటువంటి చెత్తరకం ముఖచిత్రములు వద్దని నా ప్రార్థన.

ఎ. వి. నరసింహం (మద్రాసు)

* * *

ఈవారం పత్రికలో 28—1—66 వాసంతి ముఖచిత్రం చాలా బాగుంది.

"పరిష్కారం" అన్న కథ నాకు బొత్తిగా అర్థంకాలేదు. బహుశః కథాఖండం అనుకుంటాను.

నర్సా శివప్రసాద్ (జబల్పూరు)

## కథలు

"భాస్వతి" గారు రచించిన "రాబోయే ప్రళయం" చాలా బాగుంది. మరియు సుమిత్రాదేవిగారు రచించిన "మూసిన కిటికీ" చదువుతూంటే ఎంతో ఇంపుగా వుంది.

కె. రామకృష్ణారావు (వైరా)

* * *

4—2—66 వారపత్రికలో "మూసిన కిటికీ" కథలో (36 వ పేజీ) ఆరునూరైనా, నూరు ఆరైనా చంద్రుడు కలువను కలిసి తీరుతాడు అని రాశారు రచయిత్రి. ప్రకృతి విషయాలు రాయటంలో కథలు రాసేవాళ్ళు సరిగా రాయటం అవసరం. కలువకు సూర్యునివల్ల చలనం కలుగుతుందికాని చంద్రునివల్లకాదు. తారుమారవుతే చాలా ప్రమాదం.

జి. కృష్ణమూర్తి (సికిందరాబాదు)

* * *

శ్రీ జి. కృష్ణశేషుగారు వ్రాసిన "తిరిగిరాని తనయుడు" కథలో కొన్ని వాక్యాలు మాకు చాలా ఆశ్చర్యంగా కనిపించాయి. ఎందువలనంటేకామేశ్వరమ్మకొడుకు ప్రసాద్ వి నీతిబోధలుచేస్తూ, "మన గాంధిగారు ఏం చెప్పారు? ఒక చెంపమీద కొడితే, రెండవ చెంప చూపమని చెప్పార"ని అన్నట్లుగా వ్రాసారు. గాని ఈ మాటలు గాంధిగారు చెప్పినవికావని, యేసుక్రీస్తు ప్రభువు బోధించిన వాక్యములని రచయితగార్కి తెలియదు గాబోలు. రచయితగార్కి ఈతప్పును లిపినందుకు సహృదయతతో మన్నించి ఇక ముందు వ్రాసే రచనలలో జాగ్రత్త వడగలరని ఆశిస్తున్నాను.

శీలారాణి (రూర్కెలా)

* * *

సుమిత్రాదేవిగారు వ్రాసిన "మూసిన కిటికీ" పెద్ద కథ చాలా బాగుంది. భారతి మాధవికి, చంద్రంబావ వద్ద ఆవేదన, చనియేముందు అతని హృదయ ఆలాపం రచయిత్రి చక్కగా చిత్రీకరించారు. ఈ కథ చదివిన తరువాత లోకంలో ఇటువంటి నగ్నసత్యాలు ఎన్ని ఉన్నాయో అనిపిస్తున్నది. చంద్రంకి కళ్ళు పోయిన తరువాత జీవితంలో మిగిలింది చీకటనే అతనికి తెలుసు. కాని మాధవి వెలుగు కిరణంగా కొంత చేయూత నిచ్చింది. అయినా మానసిక సంఘర్షణకు పరిస్థితుల ప్రాబల్యానికి లొంగి జీవితం నుండి నిష్క్రమించిన చంద్రంని తలచుకొనేసరికి నా మనస్సు బాధతో నిండిపోయింది. ఇటువంటి మంచి కథలే మీ పత్రికా ముఖంగా కోరుతున్నాను.

స్వామి కె. వి. ఎల్. ఎన్. (బెంగుళూరు)

## గేయం

28—1—66 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో శ్రీ పోకల ధనుంజయరావు బి. ఏ గారిచే విరచితమైన "అశ్రుతర్పణం" లోని మొదటి పద్యమును చూడగా నాకొక చిన్న సందేహం గలిగిందని వ్యక్తము చేయుటకు విచారిస్తున్నాను. సందేహానికి కారణం ప్రమకణలో సంభవించిన లోపమో లేకరచనాలోపమో తెలియజేస్తారు.

"ఇది సత్యము, అనృతమ్మికో
మదిం గలచెన శనిపాతమ్మై మెయిదూలన్
సదయాంతః కరణుడు సో
హృదయుడు దివికి యేగె నటన్న."

అను పద్యం కందపద్యమని తెలియుచున్నది, ప్రాస నియమమును బట్టి, గణ స్వరూపమును బట్టి మరియు మొదటి మూడు పాద లక్షణములనుబట్టి. కాని నాల్గవపాద స్వరూపమేమాత్రము కందపద్య నియమావళికే అనుసరణీయమై యుండలేదని తెలియగోరెదను.

చదువుల సోమశేఖరరావు (విశాఖపట్నం)

## వ్యాసాలు

14—1—66 సంచికలోని 'కాంతి' గారి "సోమవార మహాత్మ్యం" వ్యాసం చూసేసరికి, శ్రీ శాస్త్రి గారిని వారెంత అపార్థం చేసుకున్నారో అర్థమౌతుంది. "ప్రతి వారం ఒకపూట భోజనం మానితే మన ఆహార సమస్య తీరుతుందా ?" అన్నారింకొందరు. అలనాడు స్వాతంత్ర్య పోరాటంలో బాపూజీ స్వయంగా చీపురు చేబట్టి వీధు లూడ్చారంటే, అంతటితోనే దేశంలోని చెత్తంతా పోతుందనేనా ఉద్దేశ్యం ? తనూ, తన అనుచరులూ రాట్నం తిప్పి నూలు వడకగానే ప్రజలందరికీ వస్త్రాలు సమకూరుతాయనేనా ?.... కాదు. తను చేస్తే ప్రతి ఒక్కరూ తన ననుసరిస్తారని, 'ఎవరో చేస్తారులే, మన కెందుకులే' అని సోమరులు కాకుండా, వీలైనంతవరకు తమ పనులను తామే చేసుకుంటూ ప్రతి పనికీ ఇతరులపై ఆధారపడకుండా ఉండటం నేర్చుకుంటూ రనేగా వారి అభిప్రాయం. అదేవిధంగా గాంధి అనుచరులైన శాస్త్రిగారు వారాని కొకపూట ఆహారం మానమంటే "ఈరోజే డిన్నర్లూ, డాన్సులూ చేయాల్సింది"ని అనుకునేవాళ్ళందరూ, ఇప్పుడు మన దేశమున్న క్లిష్టపరిస్థితుల్లో, అటువంటి అనవసర ఖర్చులను తగ్గించి పొదుపు చేస్తూ కొంతకు కొంతైనా తమను తాము బాగుపరచుకుంటూ "రోము సగరం కాలిపోతుంటే 'ఫిడేలు' వాయిస్తూ కూర్చున్నట్లు" కాకుండా దేశాన్ని కూడ బాగుపరుస్తారని శాస్త్రిగారి అభిప్రాయమనుకొంటాను. ఒకపూట 'అన్నం' మానమంటే సంతృప్తి, ఫలహారాలు తీసుకోవద్దనా అర్థం? ఒక్కపూట అన్నం మానమంటేనే పాపం! చచ్చిపోయేటంతగా "అన్నమో రామచంద్రా!" అని అన్నం కొరకై అలమటించారే, మరి రెండు సోదర దేశాల మధ్య శాంతికై కృషిచేస్తూ, అందుల కంగీకరించక ప్రతిఘటించే వారిని తన మేధాశక్తితో 'శాంతి' కి ఒప్పించి ఆ సంతోషంతో తన ప్రాణము లనే అర్పించిన శాస్త్రిగారి కంఠం, 'పొదుపు' నకై దశదిశల మారుమ్రోగుతుంటే, వీరు "ఈరోజే డిన్నర్లూ, డాన్సులూ చేయాల్సింది" అనటం, ఆత్మద్రోహం చేసుకుంటూ 'నైట్ డిన్నర్ల' నేర్పరచడం ఎంత విచారకరంగా ఉందో ప్రతి ఒకరికీ అర్థమౌతుంది. ఇటువంటి, ప్రజలను నిరుత్సాహపరచే కథలు వ్రాయడం కూడ కడు శోచనీయం.

టి. నటరాజ (ప్రొద్దుటూరు) ●

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 25–2–'66

విశ్వావసునామ సం॥ ఫాల్గుణ మాసం శు॥ పంచమి

సంపుటము : 58 సంచిక : 26

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

క్రొత్తరేట్ల ననుసరించి 14—1—1966 మొదలు ఆంధ్రసచిత్ర వారపత్రిక చందా వివరాలు.

భారతదేశం

| | పోస్టుద్వారా |
|---|---|
| | రూ. పై. |
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతర దేశాలకు

ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 24.50 |
| అర్ధసంవత్సర చందా | 12.25 |


## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన

సం॥

# మనలో మాట

'చంద్రునికో నూలుపోగు' రచయిత 'హొజ్రీ నసీరుద్దీన్ కథలు' వారం వారం పాఠకులు చదువుతూనే ఉన్నారు. ఈ వారం వీరు లూనా—9 ప్రత్యేకత ఏమిటో వివరిస్తారు.....

* * *

'హాలీవుడ్ ప్రణయాలు' ఈ వారం ప్రారంభం అయ్యే కొత్త శీర్షిక. హాలీవుడ్ ప్రణయాలని గురించి రాసి పేరు సంపాదించుకున్న మరొక స్త్రీ, హెడ్డాహాప్పర్ ఇటీవలే మరణించింది. సుప్రసిద్ధ హాస్యనటుడు బస్టర్ కీటన్ మరణం కూడా హాలీవుడ్‌కి, సినిమా పరిశ్రమకి పెద్ద లోటు...

* * *

శ్రీ ఏ. ఎస్. ఆర్. బ్రహ్మంగారు ఇంతకుముందు లావోస్ గురించి రాసిన వ్యాసాన్ని ఆంధ్ర సచిత్ర వారపత్రిక ప్రచురించింది. ఈ వారం 'వియత్నాం' మీద ఆయన రాసిన వ్యాసం ఒకటి వేశాము. బొమ్మలు శ్రీ బ్రహ్మంగారు పంపినవే...

* * *

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకు సుపరిచితులైన శ్రీ వి. ఎస్ సుక్తాంకర్ రాసిన గోవా జానపద గాథలను వచ్చేవారంనుంచి వరుసగా ప్రచరిస్తాము. ఈ కథలను ఒక సినీ రచయిత అనువదించారు.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'మొనగాళ్లకు మొనగాడు'లో ఎస్. వి. రంగారావు.


100మిలియన్ల అమెరికా అప్పు
మన విదేశ మారకం


వివిధ దేశాలనుంచి సహాయం
ఆహారం కొరత
ఆరిపోతున్న దీపం!
ఒక కమ్యూనిస్టు నాయకుని పలుకుబడి క్షీణం


రైటు కమ్యూనిస్టులు
రష్యా
వామపక్ష కమ్యూనిస్టులు

న్యూ ఢిల్లీ లేఖ

# కొత్త ప్రభుత్వ విధానాలు?

న్యూఢిల్లీలో మళ్ళా చురుకుదనం ప్రవేశించింది. జయపూర్ కాంగ్రెసు సమావేశంతోబాటు కొంచెం హడావుడి బయలుదేరింది. ఒక సమయంలో కాంగ్రెసుపార్టీలో విప్లవం బయలు దేరుతుందా అనిపించింది. కాని, కాంగ్రెసు నాయకుడు శ్రీ కామరాజు ఉపాయాలు వేరు. పార్టీ సభ్యులలో ఎందరో కోపంగా ఉన్నారని గ్రహించి ఆహారమంత్రి శ్రీ సుబ్రహ్మణ్యాన్ని మందలించారు. శ్రీ అశోక్‌మెహతాని కూడా మందలించారుకాని బహిరంగంగా మందలించలేదు.

రాష్ట్రపతి రాధాకృష్ణన్ పార్లమెంటులో చేసిన ఉపన్యాసం చప్పగా ఉంది. కొత్త ప్రభుత్వం విధానాన్ని చాటే ఈ ఉపన్యాసంలో ఆహార, ఆరోగ్య శాఖలలో జరిగిన కృషిని కొంత వివరించటంతప్ప, ఆర్థిక పరిస్థితి చాలా ఆందోళనకరంగా ఉందని చెప్పటంతప్ప వేరే ఏమీ వివరించలేదు రాష్ట్రపతి.

సాధారణంగా రాష్ట్రపతి ఉపన్యాసాన్ని ప్రధానమంత్రి రాసి ఇస్తారు. తన ప్రసంగంలో డాక్టర్ రాధాకృష్ణన్ వృధా వ్యయం తగ్గించటం అవసరం అన్నారు. ఇది సోమవారం 12 గంటలకిముందు అన్న మాట. సాయంత్రానికి మరి ఇద్దరు ఉపమంత్రులను నియమించారు!

1947 తర్వాత ఏర్పడిన మంత్రివర్గాలన్నిటిలోనూ శ్రీమతి ఇందిరాగాంధి మంత్రివర్గం పెద్దది. ఒకపక్క పొదుపు గురించి మాట్లాడుతూనే, మరొకపక్క ఖర్చు పెంచేస్తున్నారు.

లోక్‌సభలలో ఆహారమంత్రి కొంత ఇబ్బంది పడ్డారు. కాంగ్రెసు సభ్యులు, ప్రత్యేకంగా శ్రీమాధుర్ గోధుమకి జోన్‌లు నియమించటంలో అర్థం లేదన్నారు. దేశంలో పండేదానికంటే దిగుమతే అధికంగా ఉందికదా అని ఆయన వాదం. కేరళ చర్చలో వాదాలన్నీ ప్రతిపక్షంవారికీ, వోట్లన్నీ కాంగ్రెసుపార్టీకి మిగిలిపోయాయి. 'ఎడ్జర్న్‌మెంట్ మోషన్'ని ప్రభుత్వపక్షం తోసిపుచ్చేసింది. రాజ్యాంగం ప్రకారం ఇది అవసరం. ఈ 'మోషన్' కి అంగీకరిస్తే మంత్రివర్గం రాజీనామా ఇవ్వవలసి వస్తుంది. అంతేకాక ప్రతిపక్షం ప్రభుత్వాన్ని నడపవలసివస్తుంది నేడు ముఖ్య ప్రతిపక్షం 'స్వతంత్ర' పక్షం!! ఈ పార్టీ నిజంగా మంత్రివర్గాన్ని నిర్మించం గలదా? ఈ ప్రశ్నకి సమాధానమే అనవసరం.

* * *

రైల్వేబడ్జట్ ఒకవిధంగా 'అసలు బడ్జెట్' స్వరూపాన్ని సూచిస్తుంది రైల్వేమంత్రి, 1965—66 లో ప్రయాణీకులవద్దనుంచి రాబడి అంచనాలకన్నా ఒక కోటి రూపాయల దాకా తగ్గిందని అంగీకరించినా 1966—67 అంచనాలలో ప్రయాణీకులవద్ద రాబడి 227 కోట్ల రూపాయలకి, 7 కోట్లు అదనంగాపెంచారు! రవాణా ఆదాయం 30 కోట్ల రూ. పెంచారు. 3 శాతం సర్‌ఛార్జి లేకపోతే ఈ అంచనాల గతి ఏమిటో వూహించవచ్చు. ఎన్నికలు దగ్గర పడుతున్నసమయంలో ప్రయాణీకుల టిక్కెట్ల వెలలని పెంచటం మంచిదికాదని వదిలివేసిఉంటారు. కొన్ని సీజన్ టిక్కెట్ల ధరలు తగ్గించారుకూడా. 1965—66 పరిస్థితిని సమీక్షిస్తూ రైల్వేమంత్రి, కర్చులు 21 కోట్ల రూ. దాకా పెరిగాయన్నారు. 1966—67 అంచనాలలోమాత్రం ఈ పెరుగుదల రూ. 51 కోట్లు ఉండవచ్చు నన్నారు.

* * *

లోక్‌సభలో 'తాష్కెంట్' ఒప్పందాన్ని చర్చించారు. భారత పాకిస్తాలమధ్య విరోధాల కారణాలని ఈ ఒప్పందం తాకలేదుకాని సోవియట్ నాయకుల కృషి వ్యర్థంకాలేదు. జనవరి 10 వ తేదీ కీ. శే. లాల్ బహదూర్ శాస్త్రి, అయూబ్‌ఖాన్‌లు సంతకం చేసిన తాష్కెంట్ ఒప్పందం ఈ రెండు దేశాల మధ్య శాంతి స్థాపనకి దోహదం చేస్తుందని ఎదురు చూడవచ్చు. శాంతియుతంగా విభేదాలని తగ్గించుకొనటానికి భారత, పాకిస్తాన్ దేశాలు అంగీకరించాయి. ఆగస్టు 5 వ తేదీ సేనలు ఉన్న స్థానాలకి వాటిని ఉపసంహరించాలని ఈ ఒప్పందంమొదటిషరతు.

75 పై. మిగుల్చుకోండి

మెక్లీన్స్

డబుల్ ప్యాక్ కొని

SAVE 75P
ON THIS TWIN PACK

Macleans

Macleans tooth paste

త్వరపడండి సరకు మితముగా వున్నది.

MTPLP 2 66 TL



సొగసైన కురులు

రీటా

ఏపుగా, అందంగా జుట్టును పెంచుతుంది

ఒకరి శిరోజ సౌందర్యంచూచి మరొకరు ఇక ఎంతమాత్రం అసూయపడవలసిన అవసరం లేదు. రీటా వాడి మీ కురుల సౌభాగ్యాన్ని వృద్ధి చేసుకోండి.




ఏటో కంపెని, మద్రాసు 1

R-22. TE

---

నేషనల్ ట్రాన్సిస్టర్

జపానుచే కనుగొనబడిన జేబు రేడియో. పెద్ద రేడియోలాగ పలుకుతుంది. అన్ని ట్రాన్సిస్టర్లు, లౌడ్ స్పీకర్లు గ్యారంటీ, జపాను తయారీ. మీ



ఇష్టప్రకారం ఎక్కడనైనా సంగీతం, వార్తలు వగైరా విన వచ్చు. ప్రపంచమందలి ప్రతి స్టేషను స్థానికంగా వినబడు నట్లు గ్యారంటీ. వినటానికి సిద్ధంగ పంపబడును. టార్చి సెల్స్‌తో పనిచేయును. అనువైనది, అందమైనది, తేలికైనది. 3 సం॥ గ్యారంటీ. డీలక్సునెం. TR 45 ధరరు.68/- వి.పి.పి. ఛార్జీలు రు. 6/- రేడియో లెదర్ కేసు రు. 7/-

INDOJAP ARTS (WAT-68)
Beat No. 13, Aligarh.

---

ఎలెక్ట్రిక్ & రేడియో గైడ్

ఎలెక్ట్రికల్ ఇంజనీరింగ్, రేడియోరిపేరింగ్ మెకానిజం, అసెంబ్లింగ్, ఎలెక్ట్రికల్ సూపర్‌వైజరీ, వైరింగ్ మొ॥ కోర్సులు నేర్చుకొనండి. రు 50కి ట్రాన్సిస్టర్ తయారుచేయ నేర్చుకొని యెలెక్ట్రికల్ వర్క్‌షాపు ప్రారంభించండి. (800 పటములు) రు 12-50. వి. పి. పోస్టేజి రు 2/.

**పొడుగు పెరగండి:** శాస్త్రీయ మరియు రహస్య పద్ధతుల సహాయంతో 6" వరకు పొడుగు పెరగండి. వయస్సు నిబంధన లేదు. అమెరికన్ ప్రచురణ రు. 8-50. వి.పి.పి. చార్జీలు రు 2/-

Sulekha Book Depot (WAT-15),
Beat No. 13. Aligarh.

## న్యూఢిల్లీ లేఖ

తాష్కెంట్ సోవియట్ నాయకుల కీర్తి పెంచింది. కృశ్చేవ్ కాలంలో అమలులోఉన్న భారత దేశాన్ని పూర్తిగా బలపరిచే విధానం బదులు తటస్థ విధానాన్ని రష్యా అవలంబించింది. ఈవిధానం విజయవంతంఅయింది. ఈ ప్రాంతంలో రష్యా పలుకుబడి హెచ్చు అయింది. రష్యా ఉద్దేశాలు బాధ్యతా పూరితమయినవని కూడా రుజువు అయింది.

చాలావరకు చైనా వైఖరి ఈ కొత్త పరిణామాలకి దారి తీసిందని చెప్పవచ్చు. పెకింగ్ కేవలం పాకిస్తాన్ బలపరుస్తూ వచ్చింది. ఈ 'ఉపఖండం'మీద యుద్ధాన్ని పెంచాలని చూసింది. కాని, భారత, పాకిస్తాన్ నాయకులలో చాలామంది చైనా తంత్రాలని పసిగట్టారు. పరిస్థితిని చక్కబెట్టుకోవటానికి ప్రయత్నిస్తూవచ్చారు.

'న్యూ చైనా న్యూస్ ఏజన్సీ' జనవరి 11న తాష్కెంట్ వార్తలని ప్రచురించిందికాని కోసీగిన్ కేవలం ఒక ప్రేక్షకుడు మాత్రమేనని, కాశ్మీర్ సమస్య ఏమాత్రం పరిష్కారం కాలేదనీ సూచనప్రాయంగా ఎత్తి పొడిచింది. ఆల్ బెనియాలోమాత్రం పార్టీ పత్రిక 'జెరి ఇపోపుల్లిట్' 'తాష్కెంట్ ప్రహసనం' అమెరికా ఎత్తులలో ఒకటి అని ఆరోపించింది. పాకిస్తాన్ ఈ ఎత్తులని బలపరచనప్పటికీ భారతీయ రియాక్షనరీలు, సోవియట్ రివిషనిస్టులూ అమెరికన్ సామ్రాజ్యవాదులకి తోడ్పడ్డారన్నది.

ఈ ప్రచారానికి భయపడేనేమో రష్యా, అమెరికా, బ్రిటన్‌లు తాష్కెంట్‌ని చెడగొట్టాలని చూస్తున్ననని ప్రతి ప్రచారం చేసింది! తాష్కెంట్‌ని పశ్చిమ రాజ్యాలు బలపరచిన సంగతి లోకవిదితమే.

ఈ రాజకీయ విజయంతోబాటు రష్యా ఆర్థికరంగంలోనూ కొన్ని విజయాలు సాధించింది. 1970కి భారత, రష్యాల మధ్య వ్యాపారం రెండు రెట్లు పెరగాలని జనవరి 7 వ తేదీన న్యూఢిల్లీలో ఒక ఒప్పందం చేసుకున్నారు. ప్రస్తుతం సోవియట్ యూనియన్ మన దిగుమతులలో 12 శాతం ఎగుమతులలో 7 శాతం భాగాలు పంచుకుంటున్నది. 5 సంవత్సరాలలో మన వస్త్రాలు కొనేవారిలో ప్రథమస్థానం ఆక్రమించే సూచన కూడా ఒకటి చేసింది. జనవార వస్తువులు ఇంకా అధికంగా కొంటానని రష్యా హామీ ఇచ్చింది. ప్రాజక్టులకి సంబంధించిన సహాయంలో 8—10 సంవత్సరాల వాయిదా చెల్లింపులమీద యంత్రాలు సరఫరా చేస్తున్నది.

రావల్పిండితో జనవరి 18 వ తేదీ ఒక ఒప్పందం చేసుకున్నారు. సోవియట్ యూనియన్, పాకిస్తాన్‌లమధ్య వ్యాపారం మూడు రెట్లు పెరిగే ఏర్పాట్లు చేసుకున్నారు.

—శ్రీకృష్ణ

# హాలీవుడ్ ప్రణయాలు



ఖావ్ మాజీ నట్టుమహిషితో హ్యూగ్ ఓబ్రయన్

గాబీ బ్రియర్

[గాబీ బ్రియర్ ఒక ఫ్రెంచి యువ నటి. హాలీవుడ్‌లో ఏడు సంవత్సరాలు ఉంది. వెండి తెరమీద ప్రేమికులుగా కీర్తి సంపాదించుకున్న కథానాయకులని నిజ జీవితంలోనూ కలుసుకుంది. వారి ధోరణులని, పద్ధతులని, అలవాట్లని స్వయంగా పరిశీలించ గలిగింది. — ఈ వ్యాస పరంపరలో తన అనుభవాలని కొన్నిటిని వర్ణిస్తుంది.]

ఇది కలకాదు. ఎడారి ఎండ నా వొళ్ళు మొహానికి వేడి చేకూరుస్తోంది. నా కళ్ళు మిరుమిట్లుగొనిపోయి ఉన్నాయి......

ఎవరో తలుపు తట్టారు. బద్ధకంగా సిల్కు దుప్పటీ కప్పుకుని, "లోపలికి రావచ్చు" అన్నాను.

ఇంతలోనే, ఇది పారిస్‌కాదు "లాస్‌వెగాస్" లో ఒక గొప్ప హోటల్ అని గుర్తు వచ్చింది. కాని ఆ వ్యక్తి లోనికి రానేవచ్చాడు.

అతని గొంతుక విన్నాను. అది కోట్ల మందిని తన్మయులుగా చేసిన స్వరం. ఈ ఉదయంమాత్రం నా కోసంమాత్రం ఒక పాట పాడింది. ఫ్రాంక్ సినాత్రా, "బ్రేక్‌ఫాస్ట్ వేళ అయింది!" అంటూ పాడుతూ ఫలహారం పళ్లెం మంచంమీదపెట్టి నా మీదకి వంగాడు....

అతను వేసుకున్న పంయిజామా, చొక్కా నీలం రంగువి. అతని కళ్ళు నీలం రంగుతో మెరిసిపోతూ మనల్ని మైమరిపేటట్లు చేస్తాయి నైట్ క్లబ్‌లలో పాడేప్పుడు. ఇప్పుడో? హాయిగా నవ్వుతూ కనిపించాయి. ఫ్రాంక్ సినాత్రాకి నన్ను చూస్తే సంతోషంగా ఉందన్నమాట. లేకపోతేనా! స్త్రీజాల్లా గట్టిపడి మెరిసిపోతాయి. నాలాంటి చిన్న నటిని భస్మం చేసెయ్యగలవు! అతని డబ్బుకోసం, పలుకుబడితో భాగంకోసం అతన్ని చుట్టు ముట్టేవారెందరు!

"ఏం, ఫ్రెంచి బొమ్మా!" అంటూ ఫ్రాంక్ నా ఫలహారాన్ని వడ్డించటం మొదలు పెట్టాడు. "దుమారం తగ్గింది!" అన్నాడు. గత రాత్రి మే మిద్దరం అతని కాడిల్లాక్ కారులో, లాస్‌వెగాస్ ఎడారిలో గంటకి 125 మయిళ్ళ వేగంతో వెళ్ళాము. గాలితో పందెంవేసి నెగ్గాము! గాలి వేగం తగ్గిందన్నమాట.

# సరికొత్త సచిత్ర వ్యాస శీర్షిక ప్రారంభం!

నా కిదంతా కల అనిపించింది. 'నేనేమిటి, గాబీ బ్రియర్‌నేమిటి, నీవ్స్ అనే చిన్న ఫ్రెంచి వూరులోపుట్టి హాలీవుడ్‌లో చిన్న నటిగా మాత్రం పేరు సంపాదించుకోగలిగిన దానికి ఫ్రాంక్ సినాత్రా ఇలా సేవ చెయ్యటమా!' అనుకున్నాను. కాని, కల కాదు—నిజం. ఫ్రాంక్ సినాత్రా నాకు మంచి మిత్రుడు.

ఎప్పుడూ ఒకచోట ఆగలేదు. "గాబీ, ఈతకొలను దగ్గరే మధ్యాహ్నం భోజనం! రీటా హేవర్త్ మనకోసం కాచుకుని ఉంటుంది......" అని పురమాయించాడు. ఇంకా ఏవేవో చెప్పాడు. అదంతా ఇక్కడ అప్రస్తుతం.

ఇదంతా జరిగి సంవత్సరం దాటింది. కాని ఫ్రాంక్ సినాత్రా ఇంకా నా పక్కనే ఉన్నట్లుంటుంది! ఈ కథనిమోంమార్త్ర్‌లో కూచుని రాస్తున్నా. లాస్‌వెగాస్ స్మృతులు సజీవంగా ఉన్నాయి.....

ఏడు సంవత్సరాలు హాలీవుడ్‌లో ఉన్న నేను చెప్పే విషయాలు సాధారణంగా వేరే ఎవరూ మీకు చెప్పి ఉండరు, చెప్పరు. అసలు నేనుమాత్రం ఎలా చెప్తున్నానంటే, నేను అక్కడి తారలతో కలిసి మెలిసి తిరిగాను. వారికి ఆప్తురాలనయ్యాను. వారు నాకు మిత్రులూ, సహచరులూ అయ్యారు.

నేనుఫ్రెంచి దాన్ని. ఎప్పుడూ కులాసాగా ఉంటాను. ఎవర్నీ దేనికోసం వేధించను. కొబట్టి నన్నందరూ సహించేవారు, ఆదరించేవారు. హాలీవుడ్ తారలూ, తారకలూ, నిర్మాతలూ, వాటాదార్లూ, మల్లులూ వారందరినీ బాగా ఎరుగుదును. వారిని గురించి రాయగలను.

అది ఒక అపూర్వావకాశం. ఉండాలేకాని, ఉంటే ఎన్నో వర్గాలవారికి అంతరంగికులమవవచ్చు. వింత అనుభవాలని పొందవచ్చును.

నేడు ఇరాన్ మాజీ పట్టమహిషి సొరయాని కలిస్తే ఆమె 'కాబోయే భర్త' హ్యాగ్ వో(బ్రయన్ ఒకసారి నాపక్కలో ఎలా వచ్చి పడ్డాడో, అతన్ని నే నెలా బయటికి తరమవలసి వచ్చిందో చెప్పి ఆమెని నవ్వించగలను. "నా మంచంలో నీకుస్థానం కావాలంటే అనుమతిముందు అవసరం" అని హ్యాగ్‌ని పంపేశాను!

ఈ హ్యాగ్ వో(బ్రయన్ ఎవరు? హాలీవుడ్‌లో తారలకి 'తోడు' ఏర్పాటు చెయ్యటం పరిపాటి. తారలు ఎక్కడయినా భోజనానికి, వినోదాలకి వెడితే వారివెంట ఒక మగ 'తోడు' ఉండటం మంచిదని, ప్రచారానికి పనికి వస్తుందని సినిమా పెద్ద మనుషుల అభిప్రాయం. ఈ 'తోడు' మనిషి పక్కనే ఉండటం, వారితోబాటు అన్న పానీయాలు సేవించటం తప్ప వేరే ఏమీ చెయ్యనక్కరలేదు. కాని, ఈరకం పని ఎంత కాలమని చెయ్యగలడు? అతనికే విసుగు పుట్టి, కోపగించుకోవటం తరచుగా జరిగే పని. ఈ కోపంతోబాటు కోరికలు కూడా కలుగుతాయి. కోరికలు కొన్ని తీరకపోతేనే చిక్కు వచ్చేస్తుంది.

'తోడు' మనుషులు ఎప్పుడూమామూలు వ్యక్తులుగానే ఉండక్కరలేదు. పేరు సంపాదించుకున్న నటులు కూడా ఈ పని చేస్తూ ఉంటారు. స్టీవ్ క్రోకాన్ ఇటువంటి వారిలో ఒకడు. ('హయివే 301' తార కూడా.) ఒకసారి నన్ను 'పార్టీ' జరుగుతోందని తన ఇంటికి పిలిపించాడు. వెడితే అతను తప్ప వేరెవరూలేరు! అంతేకాక, నన్ను బలాత్కరించపోయాడు. ఎలాగో తప్పించుకుని పారిపోయాను.

మార్లన్ బ్రాండో కూడా నన్నొకసారి వందమంది ముందు అవమాన పరిచాడు. ఫ్రెంచి అమ్మాయిలంటే వీరికి చులకన. మమ్మల్ని గురించి వారనే మాటలు మీరు నిజంగా వినాలి! ఇది పూర్తిగా వారి తప్పూ అనలేము. మా దేశంనుంచి హాలీవుడ్‌లో పైకి వచ్చేద్దామని బయలుదేరిన కొందరి పద్ధతులు ఈ కీర్తిని మాకు గడించిపెట్టాయి! శయ్యాగృహాన్ని మించిన సాధనం లేదని వీరి అభిప్రాయం అనుకుంటాను.

జరిగిన కొన్ని సంవత్సరాల తర్వాత కూడా ఫ్రెంచి తారల అవినీతి చర్యల గురించి విడ్డూరంగా చెప్పుకోవటం హాలీవుడ్‌లో పరిపాటి.

మగవారితో నేను జరిపిన యుద్ధాలు నాకు పేరు సంపాదించిపెట్టాయి. కొంతదాకా, ఫ్రెంచి అమ్మాయిలంటే తమాషా కాదనే భయాన్ని కొందరిలో కలిగించాను. కొందరి అభిమానాన్ని చూరగొన్నాను.

రీటాహేవర్త్ నా స్నేహితురాలయింది ఎంతో దిగాలుపడిపోయి చెప్పింది నాతో ఒకరోజు—"ఆలీఖాన్ అంటే నా కింకా ప్రేమే! మనిషి నిజంగా రసికుడు. కాని, ఎంత కాదన్నా ప్రాచ్య ప్రాంతంవాడు. బహుభార్యాత్వం అతనికి మామూలు. నాకు మాత్రం ఈ పద్ధతి నచ్చలేదు. జనానాలో ఒక భార్యగా మారిపోవటం నా కిష్టంలేదు."

గార్బో నిష్పృహని కళ్లారాచూశాను. మారిలిన్‌మన్రో ఒకసారి జో షెంక్ ఇంటికివెళ్లి, కాలింగ్‌బెల్ నొక్కటానికి కూడా ధయిర్యం లేక తిరిగి వచ్చేసిన సంగతి నాకు తెలుసు! (షెంక్ ఒక పెద్ద ప్రొడ్యూసర్.)

బర్ట్ లాంకాస్టర్—అందగాడు నిదానం మనిషి, నిర్భయుడు. అతని భార్య అందగత్తెకాదు. కాని ఆమెనిచూస్తే బర్ట్‌కి హడలు. ఎప్పుడు షూటింగ్ జరుగుతున్నా ఆమె, అయిదుగురు పిల్లలూ వస్తారు. "బర్ట్ తొందరపడి ఏ తప్పు పనీ చెయ్యడు. దాని పరిణామాల 'ఖరీదు' ఏమిటో అతనికి తెలుసు!" అంటుంది శ్రీమతి లాంకాస్టర్ అతనివంక కళ్లు పెద్దవిచేసి చూస్తే ఆడపిల్లలతో. (సశేషం)



# కరివేపాకు

## వీరాజీ

కరివేపాకు నుంచి బంగారం చేయడం యెలా గంటారా ? అది చాలా కష్టం. కష్టమే గాని అసంభవం కాదు.

* * *

రంగాయమ్మగారు మా ఇల్లుగలావిడ కనుక నేను యిలా చెప్తున్నానని అనుకోవద్దు. నిజంగా ఆవిణ్ణి యెవరు చూసినా 'మాదొడ్డ యిల్లాలనే' చెప్పుకుంటారు. ఏభై యేళ్ళొచ్చినా తొంగిచూస్తూ ఉన్నప్పటికీ ఆమెకు భగవంతుడు అందమైన మెడ నిచ్చాడు. ఆరోగ్యమైందది. కనీసం నూటయాభై, రెండు వందల గ్రాములకు తక్కువ బంగారం ఆమె ఏ సమయంలోనూ ధరించదు. ఐనా నాకా బంగారంమీద ఆశా లేదు. అక్కసూ లేదు. ఎందుకంటే వాకీ మహా (!) నగరంలో ఆవిడే కనుక యిల్లు యివ్వకపోతే, నేను నా పెళ్లాం పిల్లలతో అల్లాడిపోదును.

ఈ వూరు సంగతి మీకు తెలియదు. ఇక్కడ అద్దెకు కొంప కావాలీ అంటే జీతం రాళ్ళు తెచ్చుకుంటూ, పెళ్లాం, పిల్లల్తో కలో గంజో త్రాగి బ్రతుకుతాను అన్న వాడికి మాత్రం అంత సులువుగా దొరకదు.

''అందుకనే మీరే శిక్షయినా వేయండి, కావాలంటే మీ యిల్లు కావలా కాయమన్నా జో హుకుం గాని యీ శిక్షమాత్రం వద్దు. ఈ ట్రాన్స్‌ఫర్ వారేయకండి'' అని నే మొత్తుకున్నాను.

''బెజవాడ మహాపట్నంలో మొదటిది కొంప దొరకదు. దొరికినా అందులో నీళ్ళు దొరకవు. ఈ రెండు ఉన్నా యిల్లుగలవాళ్లవి ఏనుగు దాహాలు. ఇవంతా అలా ఉంచి అసలే బక్క శరీరంవాణ్ణి. దీన్ని నా పెళ్లాం పిల్లలికీ గాకుండా దోమలు భోంచేస్తాయి'' అని మొత్తుకున్నాను. వింటేనా ? మా యజమాని వాసుదేవరావుగారు !

''పైగా మీ అత్తవారింటికి, యిటు మీ తాతగారి వూరికీ కూడా దగ్గరగా ఉంది. ఫర్వాలేదు. నీదే ఛాన్సనుకో'' మన్నారు.

సరే ! నేను మా ఆవిణ్ని, ముగ్గురు పిల్లల్నీ మా మామగారింట్లో వదిలేసి వచ్చి యిక్కడ భోజనం టిక్కెట్ల పుస్తకం కొనుక్కున్నాను. అయితే వాళ్లు మాత్రం రెండేళ్లు భరించగలరా ? అందుకనే యిళ్లు వెతుకుతున్నట్లు చెప్పి వదిలి వచ్చాను.

ఆపద్బాంధవుడిలా మా చిన్ననాటి మిత్రుడొకడు యిక్కడే ఉంటున్నాడు. వాళ్లింట్లో ''వాళ్లు'' (పెళ్లాం వాడికి ఒక్కర్తే లెండి) పురిటికి వెళ్లారు వాడి ధర్మమాని ఆ పంచనే మేం యిద్దరం పేకాడుకుంటూ పడుంటున్నాం.

కాని మా ఆవిడ యీలోగా 'కాకిగోల' మొదలెట్టింది. ఇలా ఉత్తరాలు రాసేది.

''చి. సుగుణకు కాస్త రొంప, జలుబూ చేశాయి. మీకోసం దిక్కులు చూస్తోంది. నానిగాడు గుమ్మం తగిలి పడిపోయినాడు నిన్న మధ్యాహ్నం. కొంచెం ముక్కుమీద దెబ్బ తగిలినది. నాకు మాత్రం నిదు లేనిదే తోచును గనుకనా ? దోమలు యెక్కడ లేవు కనుక ? అంతగా అయితే దోమ తెరలు కొనుక్కోవచ్చును. నీళ్లా ? అవి యెక్కడ వస్తున్నాయి కనుక. బావిగల యిల్లు చూడండి. వప్పు ఉడికే నీరు ఉన్న చాలును. రాత్రుళ్లల్లో మీరు ఎలాఉంటున్నారో యేమో, నాకు మాత్రం కునుకు వచ్చుటలేదు... దోమలకు భయపడి కాపురాలు మానుకుంటామా...''

కార్డుమీదే ఒక రామాయణం రాయమన్నా రాస్తుంది మా ఆవిడ. అక్షరాలు ఆవగింజలంతేసి ఉంటాయి కనుక ఫర్వాలేదు! పరాయివాళ్లు వోపికతో చదవలేరు.

అందుచేతనే గృహాన్వేషణ కార్యక్రమం సీరియస్‌గా మొదలెట్టేను. కొందరిని 'బాబ్బాబూ' అన్నాను. కొందరి చేతులు పట్టుకుని యివి 'కాళ్లు' అన్నాను. ఇలా వెతుకుతూ ఉండగా గావు ఆపద్బాంధవుడిలా కనపడ్డాడు.

'ఫలానా చోట ఒక యిల్లు ఉంది' అని చెప్పాడు.

''వచ్చి నీ కడుపున పుడతాను. కాస్త వచ్చి చూపెట్టవయ్యా బాబూ'' అంటూ ఉండగానే

వాళ్ళావిడ సినిమాకి వెళ్ళాలందిట. ఎదురుచూస్తూ ఉంటుందిట. పారిపోయాడు. కొత్తగా పెళ్ళయింది లెండి. వాడి ధర్మమా అని వీధిపేరు చెప్పాడు. "కరివేపాకు చెట్టు పెద్దది ఉంటుంది. అదే ఆనవాలు" అని కూడా అన్నాడు.

వెళ్ళాను.

మేడ యిల్లే. దూరంనుంచే నా కంటికి 'ఒయాసిస్సు' లా కనపడ్డది. అదే కాబోలు కరివేపాకుచెట్టు. అంతెత్తుంది. మేడమీద నుంచి వాలుగు రెమ్మలు కోసుకుంటే చాలు. చెట్టెక్కనూ కూడా అక్కర్లేదు అనుకున్నాను. కాని దగ్గరగా వెళ్ళేసరికి నాలోని యీ ఉత్సాహం పటాపంచలై పోయింది. ఇంత పెద్ద యిల్లు. అద్దె కిస్తారా ? అని వేపేమొహం పెట్టుకుని అడగనూ ?.

కాని పట్నవాసాల్లో ఒక్కో మేడను ఏనిమిదేసి, పదేసి భాగాలు చేసి పది పదిహేను కుటుంబాలకు యిచ్చే ఆచారం ఉంది కదా ! అందుకనే గేటుమీద "కుక్కలున్నాయి జాగ్రత్త" అనే బోర్డు కూడా లేదు.

గేటు తీసుకుని లోపలికి వెళ్ళాను. నాకు లౌక్యం తెలియదని మీరనుకోవద్దు. అక్కడే ఒక పెద్ద మనిషి నెరసిన బట్టతలా, కొంచెం ముడతలుపడ్డ మొహంతో పడక్కుర్చీలో కూచొని చుట్ట కాల్చుకుంటున్నాడు.

"ఏమండీ !...."

మాట్లాడలేదు.

"చూడండి ..." అన్నాను.

చుట్ట కొసను మధ్య మధ్య వెనకనించి తగ్గిపోతుందా అన్నట్టు చూస్తూ .... చప్పరిస్తూ .... 'సరే చూశాను' అన్నట్లు తలగాడు తలయెత్తి చూశాడు.

నేను వినయంగా "ఇక్కడ యిల్లేమైనా ఖాళీగా ఉన్నాయాండీ ?" అడిగాను.

"ఆవిడ లేదు. గుళ్ళోకి వెళ్ళింది."

మళ్ళీ మా బావమరిది డిటెక్టివ్ పుస్తక పారాయణం చేసుకునేంత దీక్షగా ఆయన తన 'చుట్ట' లో మునిగిపోయాడు.

"ఈ యింట్లోనే కదండీ యిల్లు ఖాళీగా ఉంది?'

"ఉంటే ?" చుట్ట తీసి మళ్ళా నోట్లో పెట్టుకుని, దళసరి కనుబొమల క్రింద నుంచి నన్ను వేళాకోళంగా చూశాడు. లేదా నే నలా అనుకున్నాను.

"మాకు కావాలండీ."

"మా ఆవిడ యింట్లో లేదు. రేపు రాదాటయ్యా !"

నేనం బాకీలవాణ్నిటండీ ! ఆ పెద్దమనిషి అలా ఛీదరిస్తే ఔంచేతా ? అయినా అవసరం మనది. మా తాతయ్యకు కొంప కట్టాలనే జ్ఞానం లేకపోగా యీ అవస్థలన్నీ అని చచ్చి స్వర్గానవున్న మా తాతయ్యను తిట్టుకుని—

"కాదు సార్ ! వోసారి చూపిస్తే...." నసిగాను

అతను మీసాల వెనుక నించి నవ్వాడు.

"ఎట్టా చూపించమన్నావ్ ! తాళాలేం నా బొడ్డున్నాయనుకున్నావా ? మా యావిడ కొంగునున్నాయ్ ! ఇంతకీ మీకేమాత్రం యిల్లు కావాలి ?" అన్నాడు.

ఇలా ఏకవచన ప్రయోగం యింత త్వరగా వింత అనుసరించేతే మాత్రం చేయడం నాకు నచ్చలేదు. కాని అవసరం నాది. ఇల్లు కావల్సింది నాకు కనుక వ్యాకరణదోషాలా గ్రా కాసేపు మరిచిపోదా మను కున్నాను.

"ఇల్లేమాత్రం అని చెప్పాను లెండి. నేనూ పెళ్ళాం, ముగ్గురు పిల్లలు.... అంటే అంతా పసివాళ్ళేలెండి" చెప్పాను.

"ఏవూరూ ?" అన్నాడు.

"ఉద్యోగులం. ఒకవూరనేమిటిలెండి, పూర్వం యిక్కడే శివాలయంవీధిలో ఉండేవాళ్ళం, తర్వాత సామర్లకోటా, దరిమిలా వాల్తేరూ .... యిప్పుడు మళ్ళీ ...."

"సరే.... వాటాలంటూ లేవు గాని యీ క్రింది పోర్షన్ ఉంది, కావాలా ?" అన్నాడు.

ఇక మొహమాట మెందుకు ?

"అద్దె యెంత ? యెన్ని గదులూ ? భావి ఉన్నదా ? పంపులో ...."

"ఏమయ్యోయ్ ! ఆగు ఆగు ఆ వ్యవహారమంతా నాకు తెలియదు.... ఆ కరేపాకుచెట్టు చూశావా ?" అన్నాడాయన మధ్యలోనే నన్ను ఆపి.

"ఆహా" అన్నాను. నాకు కరివేపాకు కల్పవృక్షమూ అనే వ్యాసం రాయాలనే కాంక్ష ఉండేది చిన్నప్పుడు. ఏ మాష్టరూ అడగలేదు. నేను రాయలేదు.

చారులో వేసుకోవచ్చును కరివేపాకు. కూరల్లో సరేసరి. పోతే ఉప్మాలో అది లేకపోతే మజాయే లేదూ ....

"దాని కెంత తెలుసో నాకూ యీ వ్యవరా అంతే తెలుసు .... పో ! రేపురా" అని ఆ పెద్దమనిషి నా ఆలోచనాతరంగాలను తెంపేశాడు !

రే పెంతదూరం కనుక !

వెళ్ళిపోయాను. మావాడింటికే వెళ్ళాను. కాయితం, కలం తీసుకున్నాను. మావాడు 'పేక' కలుపుతున్నాడు.

"సారీరా ! బ్రదర్ ! యివాళ ఉత్తరం రాయాలి" అన్నాను.

వాడు నోరు విప్పేశాడు. "ఏమిటి కథా ?" అన్నాడు. "ప్రేమలేఖా ?" అడిగాడు.

"పెళ్ళానికే" నవ్వేస్తూ గట్టిగా చెప్పాను. "ఇల్లు దొరికిందిరా భాయ్ ! ఇక నీకుకూడా మీవెళ్ళెలు (మా యావిడ అన్నమాట) యింత ఉడకేసి పడేసే రోజులొచ్చాయ్ !" అన్నాను.

"అచ్ఛా !" అన్నాడు వాడు. వాడికి వాడే పేక ముక్కలు పంచేసి ఎత్తి చూసుకుంటూ.

నేను ఉత్తరంలో—బహుశా నా తొలి ప్రేమలేఖ అయ్యుంటుంది అది. మా ఆవిడకే కాదు. మరెవరికి, యిదివరకు రాయలేదు. ఒక్క ఉద్యోగం, 'తోను' కోసం తప్ప నేను 'ప్రేమలేఖ' రాసిన జ్ఞాపకం లేదు.

"... కరివేపాకు చెట్టు ఉంటే కల్పవృక్షంతో సమానమని మనం అనుకునేవాళ్ళం కదూ. ఆయింట్లో చాలా పెద్ద చెట్టు ఉంది. కరివేపాకు గురించి ఆయుర్వేదంలో ఎంతెనా చెప్పారు పెద్దలు. అది సర్వరోగ నివారిణి అనుకో. దాన్ని రోజూ కోసి చారులో వేసుకోవచ్చును. పప్పు కట్టులో, కూరలో, పులిసిన మజ్జిగలో పోపుతో పాటు కరివేపాకు వేస్తేనే మజా ....

ఇంకా దాన్ని వేచి, మిరపకాయలూ, మినప్పప్పూ కలిపి దంచుకుంటే కారప్పొడి అవుతుంది. ఇది ఇడ్లీలతో నంచుకుంటే అమృతంలా ఉంటుంది. నూకలకీ, గింజలకీ తప్ప, కరేపాకు అమ్మరూ అంతే! ఎందుకనుకున్నావ్ ? దాని విలువ అపారం కనుకనే.

అలాంటి కరేపాకు మహావృక్షం నీడలో మనకి ఒక యిల్లు చూశాను. ఇంటి పెత్తనం యిల్లాలిది కాబోలు. ఆ వెర్రిబాగుల మొగుడు రేపు రమ్మన్నాడు. ఆ యిల్లాలు యిస్తుందనే ఆశ ఉంది. నా అంతరాత్మ అలా చెపుతోంది. నువ్వూ పిల్లలూ సిద్ధంగా ఉండండి. నేనే నెలాఖరుకు మిమ్మల్ని తీసుకుని వస్తాను. ఖాయం..." మిగతా లాంఛనాలన్నీ ఉంటాయిగా ఉత్తరానికి. అవి పూర్తి చేశాను. ఇంకో తీపులో సంతకం చేశాను. మా ఆవిడకు రాను కాని పోలుస్తుందిలెండి.

పోస్టులో పడేశాను!

"అమ్మయ్య ! యీ వూళ్ళో కూడా ఒక మంచి కొంప సంపాదించాను" ని నిట్టూర్చాను.

* * *

మేమీ యింట్లో దిగింతర్వాత వారం తిరగకుండానే నా శ్రీమతి చాలా విషయాలు చెప్పింది. ఆడాళ్ళ మాటలు పట్టుకుని మనం తగూలకి వెళ్ళకూడదు. అందులోనూ మనమీద అంతస్తులో —నా ఉద్దేశంలో మేడమీద అనికూడా—ఉన్న ఇంటిగలవాళ్ళతో పోట్లాడటానికి కాస్త వెనుకాడాలి!

వాళ్ళు తొక్కాపొయ్యొచ్చు మనమీద. లేదా రాత్రుళ్ళు మంచాలు 'బరా బరా' యీడుస్తూ మనకు నిదకలలు తెప్పించవచ్చు. లేదా తూములో మురికినీరు పోసేయొచ్చు. పెరట్లో మన మరుగు గదుంకేసి ఆదే పనిగా చూస్తూ ఆడా మగా వని పాటూ, స్నానం గీనం చేసుకోకుండా యేడిపించుకు తినవచ్చును. ఇవన్నీ పైన ఉన్న వాళ్ళకుగల అవకాశాలు. వాళ్ళు యింటిగలవాళ్ళే అయితేనా ?

కరివేపాకు దగ్గరే తగవులాడడం నా మనసుకు చాలా నొప్పినిపించింది. పోయిన శుక్రవారం అసలు పెరట్లో ఉన్న గోరంటాకు దగ్గర వచ్చిందిట యీ తగవు.

మా సుగుణ గోరంటాకు కోసుకుంటోందిట. రంగాజమ్మగారు మేడమీదనుంచే యీ దృశ్యాన్ని అక్కణ్ణుంచే "కొంపలంటుకు పోయినట్టు" కేక వేశారుట.

"అయ్యోయ్యో ! నీ చేతులు పడా ... అలా చెట్టంతా దూసుకుంటున్నావ్ యెంవలబ్బమయ్యో" అంటూ చాలా అమర్యాదగానే ఆవిడ కేకలు వేసిందట. మా ఆవిడ చెప్పిన మాట లలా ఉన్నాయి. నేను ఆరోజే మునిసిపాలిటీని అడుగుదామను కున్నాను.

కాని నేను మెట్ల దగ్గరకు వెళ్ళేసరికి పైనుంచి రంగాజమ్మగారి కంచు కంఠం మ్రోగుతోంది.

"ఇల్లుగలావిడ ఆయన్ని" అని అని సగర్వంగా చెప్పుకునే మా యింటిగలాయనమీదే ఆవిడ అంగ విన్యాసయుక్తంగా కేకలు వేస్తున్నది.

"నా యిల్లు నా యిష్టం...పిల్లా పీచూ లేనంతమాత్రాన కొంప పందికొక్కులకీ, దొంగలకీ చిదొపెట్టుకుంటామా ?", అంటుందావిడ.

నాకు ధైర్యం చాల్లేదు.

పైగా మొగుణ్ణే "చాతకానివాడివి నా కడుపున

'కాయ' యివ్వలేనివాడివి... "అదీ యిదీ అంటున్నదే ఆమె ....

నన్ను యింకా యేమేనా అనొచ్చును. నే నాఫీసుకి వెళ్ళిపోయాను. కాని మళ్ళీ యివాళ కరేపాకు దగ్గర వొచ్చింది తగవు.

రంగాజమ్మగారి వాదనలో కొంత అర్థముంది. లేకపోలేదు. నేను ఆ యింట్లో అద్దెకు దిగానే కాని, పెరట్లో ఉన్న మొక్కలకీ చెట్లకీ చేమలకీ అద్దె యివ్వటం లేదుగా ....

కరివేపాకు మొదట్లో మా సుగుణను పిలిచి ఆమె యిచ్చేది. మేడమీదకు 'ఒసే పాపా! యిలా రా' అంటూ పిలిచి,

"కరేపాకు కొనకండి. మాకలు మాత్రం యీ కరువు కాలంలో వూరికే వస్తాయా ?" అంటూ నాలుగు రెమ్మలు యిచ్చేది. కాని నేనే వెర్రి వెధవలా యీ పోట్లాటకు కారణం అయ్యాను. ఉదయంలేచి మొహం కడుక్కోక మునుపే ఒక వెదురువాసం తీసుకుని దానికి కత్తి ముక్క కట్టి పాప కిచ్చాను.

"వెధవ నాలికె. దానికి రుచులు కావాలి గదండీ ! పైగా .... కరివేపాకు కల్పవృక్షమనే ఒక సిద్ధాంతముంది కదా నా తలకాయలో...."

"కరివేపాకు కోసి మీ అమ్మకు యివ్వండే, నువ్వూ తమ్ముడూ. అమ్మ కారప్పొడి చేస్తుంది. రేపు యిడ్లీన్లు చేసుకుంటే ఆదివారం హాయిగా గడిచి పోతుంది" అని చెప్పాను.

ఆ తర్వాతే యుద్ధం జరిగిపోయిం దన్నమాట.

'నే నామెతో చెపుతానులే' అంటే మా ఆవిడ వినదు కదా ! "కరివేపాకు కల్పవృక్షమూ అంటూ నన్ని నరకకూపంలో పడేశారు. పిల్లా పీచూ లేరు. వెనుకా ముందు లేరుకదా ! ఆవిడ కెందుకండీ అంత పిసినారితనం" అంటుంది.

# కరివేపాకు

"కరివేపాకు కోయడానికి కూడా అశుభం శుభం ఉంటాయా ? పైగా శనివారంట. వేంకటరమణ మూర్తికి అతి ప్రియమైనదట. కరివేపాకు కోయ కూడదట. పిల్లల చేతులు ఎర్రగా కందిపోయేలా లాక్కుపోయిందండీ కోసిన కరివేపాకంతా...."

అలా మా 'ధనమ్మ' నన్ను పట్టుకు దంచేసింది.

తప్పంతా నాదేనన్నా వూరుకోదు కదా !

మర్నాడు ఉదయమే ఆదివారంగా.

ఇడ్లెన్లలోకి ఉల్లికారమే నూరుకుంటున్నాం. అంటే 'ధనం' నూరుతోంది. రంగాజమ్మగారు మేడ దిగి తులశికోటలో నీళ్ళు పోసుకుందికి వచ్చారు.

నన్ను చూసి అదోలా అయిపోయి పైట మరీ యిలా లాక్కుని అటు మొహం తిప్పి, నీళ్ళు కోటలో పోసి, తీసి నెత్తిన జల్లుకుని, తులసిదళం కోసి నోట వేసుకొనిపోతూ ....

"ఇవాళ అఫీసు లేదా బాబూ !" అన్నది.

"ఆదివారంగా" అన్నాను ఆవిడకు ఏడుపుల్లి ఆముదం ఉడుకుతున్న నా మొహం యిక చూడగల శక్తి లేకపోయింది కాబోలు. వెళ్ళిపోయింది. ఆవిడ మెట్లన్నీ యెక్కాకా నాకు వళ్ళు మండి పోయింది.

"ఇలాంటివాళ్ళే గోవును చంపి చెప్పులు దాన మిస్తారు" అన్నాను.

మా ఆవిడ నవ్వుతూ వెటకారంగా ఎవరితో రహస్యం మాట్లాడుతున్నారూ అన్నది—లోటి దగ్గర్నుంచే.

అంటే 'చవటా ! రంగాజమ్మగారి దగ్గర నీకు భయమూ' అని అర్థం. నిజం చెప్పకేం గాని.... నాకు ఆవిడంటె కాస్త భయమే. మా ఆవిడన్నా ఉందనుకోండి. అది వేరే సంగతి.

ముట్టి చప్పరిస్తూ ఆ తర్వాత ముసిలాయనే అనగా మా యిల్లుగలావిడ అయినప్పమాట, వచ్చాడు.

నిప్పటి తగాదాకు స్వస్తి చెప్పాల్సి ఉందిగా మరి !

చెప్పాడు. 'ఫర్వాలేదండీ. మనలో మనకేమిటి?' అన్నాను.

అసలు పిల్ల కరేపాకు 'కత్తి కర్ర' తో కోస్తున్నం దుకు కానేకాదుటా రంగాజమ్మగారు పోట్లాడింది. ఆ కరేపాకు చెట్టుమీద ఒక కాకి గూడు పెట్టు కుంది. అందులో గుడ్లున్నాయి. అవి ఆ కాకివేనని ఆమె నమ్మకం. వాటికి యీ కర్ర ఎక్కడ తగిలి అవి క్రింద పడిపోతాయోననే ఉద్దేశంలో "అలా కాస్త కేకలు వేసిందట" అంతే....

నాక్కూడా యీ కారణం సబబే ననిపించింది. "పోనీలెండి. కరేపాకేం భాగ్యమా ? బంగారమా ? కొనుక్కుందాం" అన్నాను.

ముసిలాడు దీనికి సమాధానం 'సరే' ననాలో 'లేదు' అనాలో కనుక్కున్నట్లు లేదు.

అంచాత "అమ్మమ్మ" అన్నాడు ముక్కుమీద వేలేసుకుని !

మా ఆవిడ వళ్ళుమంట తీర్చుకుందికి "అదీ తప్పేనా బాబయ్యగారూ! అమ్మ పెట్టా పెట్టదు... అడుక్కో తిననియ్యదూ అని సామెతట" అన్నది.

ముసిలాడు లేని సత్తువ తెచ్చుకుని మరీ గబగబా వెళ్ళిపోయాడు.

నేను మా ధనాన్ని పిల్లల్ని ఆరోజు మ్యాటినీకి తీసికెళ్ళేదాకా అలా "అది" (నా యిల్లాలు) కారాలూ మిరియాలు నామీద నూరుతూనే ఉంది.

మా ధనం చెప్పింది. అసలు కాకిగూడూ కాదూ... వెంకటేశ్వరస్వాములవారి భక్తీ కాదుటూ. రంగాజమ్మగారి కరేపాకు 'కక్కుర్తి' (మా ఆవిడ మాటల్లోనే), అంతా దాన్ని అమ్ముకుందికేనట!

అమ్మడం ? ఇంత ఇల్లూ, అంత పెరడూ, అంత మొగుడూ. మెడనిండా బంగారం ... పైగా పిల్లా పీచూ లేదు .... అతనికి 'పింఛను' వస్తుంది కూడా కదా ! కరివేపాకు ఎందుకు అమ్ముతుంది.

మా ధనం మాటలు కాదనటానికి ధైర్యం కావాలి.

సుగుణ చెప్పింది.

" అమ్మమ్మగారేం (అంటే రంగాజమ్మగారు) **మొన్న మా ఖళ్ళో అమ్మాయి మమతకి వదినోమ** పైసంకి యింత గోరంటాకు యిచ్చారు నాన్నారూ" అని ....

రంగాజమ్మగారంటే నాకు గల భక్తి పోయింది. భయం పోయిందా ? అనడక్కండి. ఇల్లుగలావిడంటే ఎవరికేనా అది పోదు.

"పిల్లలున్నవాళ్ళకైతే యిలాంటి దానం ధర్మం భూతదయా. లేనివాళ్ళ కేమిటండీ ?" అంటోంది. మా ఆవిడ. దాని కెవరిమీదైనా కోపం వస్తే చాలు. ఇక వాళ్ళ నీడక్కూడా అది అష్టవంకరలు, అరవై లోపాలూ పెట్టగలదు.

రంగాజమ్మగారి మెడలో మున్న బంగారం అంతా ఆమె సొంతమట ! ఇల్లు ఆమె పేరనే ఉంది. తాళాలు ఆమె బొడ్డులోనే ఉన్నాయి. నా 'ముక్కు పిండి' అద్దె ఆమే యే అందుకుంటుంది. అంతా అమ్మగారి పెత్తనమే ! అయ్యగారి దేమైనట్టూ ?

ఏమోకాని .... నేను మాత్రం కరివేపాకు విష



యము మరిచిపోదా మనుకున్నాను. గాలీ, వెల్తురూ పెరడూ గిరడూ, పంపూ గింపూ లాంటి సౌకర్యాలు గల యిల్లూ తపస్సు చేసినా దొరకదు. కాని కరే పాకుతో 'లేహ్యం' చేసుకుంటే నిజంగా జాండిస్ రాదుట. మా 'ఆఫీసు బోయ్' చెప్పాడు.

ప్ఫ్ ! ఏం చేస్తాం .... ఎప్పుడేనా ఆవిడ వూ రెళ్ళదా ? (ఛీ, ఛీ! దొంగబుద్ధి తెంప లేసుకున్నాను)

ఆదివారం వచ్చింది. మామూలుగానే నేను పేపరు చదువుకుంటున్నా. ఒక ముతక మనిషి ఉంగ రాల జుట్టూ, కావిరంగు పంచే అవీ ఉన్నాయి— వచ్చాడు. గేటు తీసుకుని లోపలకు వచ్చాడు.

మేడమీదకు వెళ్తున్నాడు.

మనకేంలే అని వూరుకున్నాను. మనిషి కాయ కష్టం చేసే వాలకంగానే ఉన్నాడు. సైకిల్ మీద వచ్చాడు.

మా ఆవిడ పొయ్యిమీద గిన్నె క్రింద పడవేసి వచ్చింది. మా వంటాళ్ళి ఎత్తుకోమంటూందేమో ననుకున్నా. కాదు. "చూశారా ? సైకి యిలా వెళ్ళాడే వాడికే పోయిన శుక్రవారం పొద్దున్నా ... 'రొడ్డుబుకి రొడ్డుబు' కరివేపాకు రూపాయి న్నర పుచ్చుకుని అమ్మేసింది" అన్నది రహస్యంగా.

'అలాగా' అన్నాను.

కాకి గూడు పడిపోలేదా ? అనుకుని చెట్టు మీదకు చూశాను. చెట్టు కొమ్మల మధ్య కాకి గూడు ఉన్నది కాని, కరివేపాకులు మాత్రం అంత దట్టంగా లేవు.

"పోన్లే ! మనం కొనుక్కుంటాం ?" అన్నాను.

"ఏం మనుషులో ఛీ !"

మా ఆవిడ మాట విరిచి (ఆనాటి) వొళ్ళు కూడా ... తిప్పుకు నన్ను యీసడించి వెళ్ళిపోయింది.

"సైకి విలువ తెలియనిదే బంగారం విలువా తెలియదూ" అంటుంది రంగాజమ్మగారు. కాని నాకు కరివేపాకు గురించి యిన్ని రకాలు తెలుసును కాని, యిలా అమ్ముతారని కూడా తెలియదూ.

ఆ ముతక మనిషిని అడిగాను. "ఏమయ్యా మేకలకా ?" అని.

"కాద" న్నాడు.

"మరెందుకూ ?"

ఏ కెందుకులేవయ్యా అన్న ధోరణితో ... "అమృతానికి"—అంటే అమ్మ ... అని అర్థం— అన్నాడు.

"అలాగా" అన్నాను.

"మరేనండి" అన్నాడు.

రూపాయిన్నర యిస్తాడుట.

వోహో ! ఎలా, దూసేశాడు చెట్టుని. "క్షవరం చేసేశాడు" అన్నాడు మా వాడిగాడు.

కరివేపాకు 'అబ్బి' అదంతా మూటగట్టి సైకిల్ మీద తీసుకుపోయాడు !

నేను దుఃఖంగా చూస్తూ వూరుకున్నాను. అయినా ఉండబట్టక, పోయేవాణ్ణి పలకరించి.

# కరివేపాకు

"మళ్ళీ వారం వస్తావా ?" అన్నాను.

"చూద్దాం ! అప్పటి కెవరెక్కడుంటామో" అన్నాడు వాడు. వీడి వేదాంతం మండా !

"నువ్వు యిల్లు ఖాళీ చేయిస్తావ" ని వీడికి రంగాజమ్మ చెప్పలేదుకదా ! అదే పోకపోయాడు !

నాకో 'అయిడియా' వొచ్చింది. నేనే ఒక మారు వేషం వేసుకోడంట ! పెద్ద గోతాం తీసుకుని రావడం. బుర్రమీసాలూ, చేతి కడియాలూ అన్నీ పెట్టుకోవాలి మరి. సినిమాలో లాగ, "అమ్మా ! (బొంగురుగా) రంగాజమ్మగారూ !" అనడం "నాకు కరివేపాకు మందులు చేయడానికి కావాలి ! ఉచితం కాదు. పది రూపాయ లిస్తాను. మీ చెట్టు శాస్త్రరీత్యా శ్రేష్టమైంది. అందుకే యీ బంగారంలాంటి కరేపాకుకు పది అణాలుకు బదులు పది రూపాయిలు యిస్తాను" అనడంట.

ఆవిడ 'ఎగిరి గెంతేసి' (అంటే అంత సంబరంగా అన్నమాట) ఒప్పుకుంటుందిగా. ఆకును అంతా కష్టంగా కోసి గోతాంలో కెత్తుకుని, దిగి సైకిలెక్కి అదే పరుగున పారిపోడంటా!.... (పది రూపాయిలూ లేవూ, గిది రూపాయిలూ లేదూ)

ఇలా నేను పగటికలలు కంటూనే ఉన్నానూ... వేడమీదనుంచి కెనెడా యింజన్‌లా 'భాఁ భాఁ' మంటూ మా ఇల్లుగలావిడ కేకలు!

"నోరి నీ మొహం తగలెయ్యా నీ కడుపుడకా ! నా కరేపాకునంతా ఆదివారంపొద్దు అనక దూసుకు పోతున్నావట్రోయ్ !" అంటూ ఆవిడ బంగారం పోయినట్లే క్రిందకి వస్తోంది.

నా గుండెలు జారిపోయాయి. నేను పూరికే లోపల లోపల అనుకుంటున్నానే. కొంపతీసి అదే యీవిడ పసిగట్టలేదుకదా !....

లేచి నిలబడి .... "అబ్బే !, అబ్బే ! ఏమీ లేదే" అన్నాను.

"అయ్యో! ఏమీ లేదంటావేం బాబూ ! ఆ దొంగ వెధవ, నీ కళ్ళముందేగా చెట్టంతా దోచుకు పోయాడూ ?" అంటోందావె.

మందులో కన్నాట్ట! నాలుగాకు అన్నాడుట. (అబద్ధమంటుంది మా ఆవిడ) 'చెట్టుకి చెట్టే మోడు ఉంచి పట్టుకుపోయాడో'నని ఆవిడ కేకలు వేస్తోంది. నేను వోదార్చితే మా ఆవిడ నాకా పూట కడుపు తగుల్చుకోనేందుకు చిలక్కొయ్య యివ్వడం ఖాయం. నోరుమూసు కూర్చున్నాను.

"అయితే పిన్నిగారూ ! వాడు డబ్బు యివ్వకుండా పోయాడా ?" మా ధనం అమాయకంగా వేళాకోళంగా అడుగుతోంది.

రంగాజమ్మగారు చిందులువేస్తూనే ఉంది. రెండో మూడో యిస్తాననే ఉంటాడు. వాడు కాని, మేడ మీద యీవిడ ఏ వేంకటేశ్వర స్తోత్రమో చేసుకుంటూ ఉన్నది కదాని, స్వామివారి ప్రీతి అయిన పదార్థమేగా నని—ఆమెకు పుణ్యం దక్కించాలని— అలా యిస్తానన్న నాలుగు డబ్బులూ ఎగేసి— ఎగిరిపోయాడన్నమాట.

నాకు లోపల లోపల సంతోషంగానే ఉంది. నేనే మారువేషం కట్టనక్కర్లేదుగా. ●



బలము మరియు శక్తి కోసం!
కోకో
పంచదార
మాల్ట్
పాలు
Bournvita
THE IDEAL FOOD DRINK
FOR STRENGTH AND VIGOUR
బోర్న్‌విటా పోషకత్వమునకు సముచితమైనది.
కండరములు మరియు టిస్యూలను బలపరచుటకు ప్రోటీన్లు,
బలము మరియు శక్తి కోసం కార్బోహైడ్రేట్లు. ఎముకలను
దృఢముగా చేయుటకు ఖనిజ-లవణములు మరియు ఆరోగ్యమునకు
అతి ముఖ్యమైన విటమినులు మీకు లభించును. బోర్న్‌విటా
తయారు చేసుకోవడం సులభం మరియు అది రుచిగా కూడా
క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా

# వారఫలం

## 25-2-1966 శుక్రవారం మొదలు 3-3-1966 గురువారం వరకు.

**మేషం :** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి. కొన్ని వ్యవహారాల్లో మీ అంచనాలను మించిన వ్యయం జరగడంవలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. వృత్తిలో మీకు మున్ముందు లాభించగల వ్యవహారాల్లో అనుకూలతను సాధించగలరు. ఉద్యోగంలో మీకంటె పెద్దవారు కూడా మీ అభిప్రాయాలను ఆమోదిస్తారు. కుటుంబ సంతోషం లభిస్తుంది. బంధువుల వ్యవహారాల్లో కొంచెం శ్రమపడినా, తుదకు మీ ప్రయత్నాలు రాణించగలవు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి ప్రోత్సాహకరంగా ఉంటుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు ఇదివరకటి కంటె బాగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**వృషభం:** వృత్తి వ్యాపారాల్లో కొంచెం శ్రమ కలిగినా, తగిన ప్రతిఫలం లభించడంవలన ఈవారం సంతృప్తికరంగానే ఉంటుంది. వ్యాపారం భారీ యెత్తున చేయడంవలన ఆర్థిక వ్యవహారాల్లో తొట్రుపాటు కలుగగలదు. వృత్తిలో కొత్తవారి పోటీని ఎదుర్కొని అనుకూలతను సాధించగలరు. వ్యాపార రీత్యా చేసే ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. వారం ప్రారంభంలో ముఖ్యమైన వ్యవహారాలు మీరు స్వయంగా చూడడం మంచిది. కుటుంబ వ్యవహారాలు బాగానే ఉంటాయి. రాజకీయ నాయకులకు మంచి సమయం.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు.

**మిథునం :** వృత్తి వ్యాపారాల్లో వారం మధ్యలో కొన్ని చికాకులు కలిగినా, సమయానికి కొంతమంది మిత్రుల సహకారం లభించడంవలన, వాటిని అధిగమించి అన్ని వ్యవహారాల్లోనూ స్వల్పాభివృద్ధిని సాధించగలరు. వారం ప్రారంభంలో సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా కొంతవరకు లాభిస్తాయి. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాల్లో ఇదివరకు ఏర్పడిన అవరోధాలు పూర్తిగా తొలగకపోవచ్చును. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి. అనుకూలమైన వార్తలను వింటారు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. అలంకార వస్తువులు కొంటారు.

**కర్కాటకం:** ఆదాయం బాగానే ఉన్నా వృత్తి వ్యాపారాల్లో తరుచుగా శ్రమకు గురికావలసి వస్తుంది. వ్యాపారంలో కొన్ని అవకాశాలు ఇంద్రధనుస్సు వలె ఆకర్షణీయంగా కన్పిస్తాయిగాని అవి కార్యరూపాన్ని ధరించడం కష్టం. ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాలవల్ల కొంత డబ్బు చికాకుల్లో పడిపోయే ప్రమాదం ఉంది. ఉద్యోగంలో మీ పరిస్థితి వారం ప్రారంభంలో బాగానే ఉన్నా, వారాంతంలో వ్యతిరేకంగా మారగలదు. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. సాంఘిక కార్యక్రమాల్లో మెప్పుకురాని బాధ్యతను వహిస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. నూతన విషయాలను తెలుసుకొంటారు. పుణ్య కార్యాలు చేస్తారు.

**సింహం :** మీరు స్వంతంగా చేసేవ్యాపారాలకంటె భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. వృత్తిలో ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాలవల్ల వెంటనే విశేషమైన ప్రయోజనం ఉండకపోవచ్చును. గాని వాటి ఫలితాన్ని మున్ముందు తప్పకుండా పొందగలరు. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆదాయం మాట ఎలాగ ఉన్నా, రావలసిన డబ్బు సమయానికి అందకపోవడం వలన ఇబ్బంది కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభదాయకంగా ఉంటాయి. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. పోటీ వారితో మాట పట్టింపులకు దిగడం మంచిదికాదు.

**కన్య :** వారం ప్రారంభంలో వృత్తి వ్యాపారాల్లో ఆందోళన కలిగించే పరిస్థితులు ఏర్పడుతాయి గాని, తరువాత క్రమంగా అనుకూలత లభిస్తుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభించగల సూచనలు ఉన్నాయి. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. సమయానికి ఏదో ఒక విధంగా డబ్బు చేతికి అందగలదు. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. శుభకార్యాల విషయంలో మీ ఆలోచనలకు అనువైన సంఘటనలు జరుగుతాయి.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల :** ఏ వ్యవహారంలోను ఆరంభంలో కనుపించిన **అనుకూలత ఆఖరు వరకు నిలవదు కాబట్టి వృత్తి వ్యాపారాల్ల సామాన్యమైన ఫలితంతో సంతృప్తి** పొందడం మంచిది. నూతన వ్యాపారాల్లో ప్రయోజనం కంటే ప్రయాస అధికంగా ఉంటుంది. రావలసిన డబ్బుమీద ఆధారపడి ఇతరులకు వాగ్దానాలు చేయడంవలన మున్ముందు ఇబ్బంది కలుగుతుంది. వారాంతంలో చేసే ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. ఉద్యోగంలో ముఖ్యమైన నిర్ణయాలు వారాంతంలో చేయడం మంచిది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభించగలవు.

**వృశ్చికం :** వృత్తివ్యాపారాల్లోమీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. కాని మీకు **వ్యతిరేకంగా ఏమీ జరుగదు.** కొన్ని వ్యవహారాల్లో **మీరు ఎదుటివారి మంచిని కూడా ఆలోచించడం** వలన మీరే ఇబ్బందిని పొందవలసి వస్తుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు సామాన్యంగా ఉంటాయి. వృత్తిలో కొత్తవారితో పోటీ ఏర్పడడం వలన మీ కార్యక్రమాలను మార్చుకోవలసి వస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం అధికం కాగలదు. మీ ఆరోగ్యం బాగానే ఉన్నా, సంతానానికి అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగానే ఉంటాయి. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

**ధనుస్సు:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. ఇదివరకు ఏవో కారణాల వలన ఆగిపోయిన వ్యవహారాలను ఇప్పుడు లాభదాయకంగా పూర్తిచేయగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా కొంతవరకు లాభిస్తాయి. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాల్లో మీకు సమయానికి కొంతమంది మిత్రుల సహకారం లభించగలదు. వ్యాపారంలో మీకు మున్ముందు ఉపయోగించగల వ్యక్తులను కలుసుకొంటారు. సాహిత్య కళారంగాల్లో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయతగదు. శుభమూలంగా వ్యయం జరుగుతుంది.

**మకరం :** మీరు ఘనవిజయాల్ని ఏమీ సాధించలేక పోయినా, వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరడం వలన ఈవారం సంతృప్తికరంగానే ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో తాత్కాలికమైన మొగమాటాలకు లొంగిపోవడం తగదు. వ్యాపారంలో కొంతమంది మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసికొనడంవలన కార్యభారం పెరుగుతుంది. వృత్తిలో ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. ఉద్యోగంలో పోటీవారితో గౌరవం లభిస్తుంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభించగలవు.

**స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు కొంచెం** శ్రమమీద నెరవేరతాయి. బంధువులకు సహాయం చేయగలరు.

**కుంభం :** ఈవారంశుభాశుభమిశ్రమంగాఉంటూ కొన్ని వ్యవహారాలు సులువుగా నెరవేరినా, మరి కొన్ని వ్యవహారాల్లో శ్రమ పొందవలసి వస్తుంది. వృత్తిలో అకారణంగా ఆందోళన కలిగించే పరిస్థితులు ఏర్పడతాయి. వారం ప్రారంభంలో సాహసముతో కూడిన వ్యవహారాలు స్వల్పంగా లాభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో మీ పక్షంలోనే భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. శుభకార్యాల విషయంలో మీ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

అలంకార వస్తువులు కొంటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**మీనం :** ఫలితం మాట యెలాగ ఉన్నా, ప్రయత్నించిన ప్రతి పనీ సులువుగా నెరవేరడంవలన ఈవారం సంతృప్తికరంగానే ఉంటుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో ఇదివరకు ఏర్పడిన చికాకులు తొలగిపోతాయి. వృత్తిలో యితరులమీద అధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. సమయానికి ఏదో ఒక విధంగా డబ్బు చేతికి రాగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాలు యిదివరకటి కంటే బాగా ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

—మహేష్

సీరియల్

# కరుణ






కొండముడి శ్రీరామచంద్రమూర్తి

### జరిగిన కథ

జమదగ్ని భార్య శారదాంబ తన కుమారుడు ప్రసన్నతోపాటు విశ్వనాథంగారమ్మాయి కరుణను కూడా పెంచి పెద్ద చేస్తుంది. పెద్దకుమారుడైన మన్మథను జమదగ్ని తమ్ముడు చలపతి పెంచుకుంటాడు. కరుణను మన్మథకు చేసుకోమని జమదగ్ని కోరినా కరుణ ప్రసన్నలు ప్రేమించుకున్నందువల్ల ప్రసన్నకే ఇచ్చి చేయడానికి మన్మథ ఇష్టపడతాడు. ఇబ్బందుల్లో ఉన్న తన స్నేహితుని కొడుకు వీరభద్రానికి, తనవారు కళ్యాణినిచ్చి వివాహం జరిపి సహాయుడుగా ఉంటాడు జమదగ్ని. ప్రసన్న కరుణకు వివాహం జరుగుతుంది. ప్రసన్న కూడా పై చదువులు చదవటానికి నిశ్చయించుకుంటాడు. చలపతి మన్మథను చదివించాలని పట్టుపట్టటంతో ప్రసన్న చదువు మానేయాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. కరుణ, మన్మథ, వీరభద్రంలు ఎం.ఏ. లో చేరటానికి వాల్తేరు వెళ్తారు. డబ్బు సంపాదించటానికి మన్మథ చేసిన ప్రయత్నాలు వ్యర్థం అవుతాయి.

## 18

"ఎవరు మీరు ?" మన్మథ, లోపలి కంగారు అణచుకుంటూ అడిగాడు.

**ఆవిడ నవ్వింది. "స్త్రీని." ఆమె మాటలో అపశబ్దం లేదు. ఆమె చూపులో పేలతనం లేదు.** నుంచున్న తీరు, మన్మథ వైపు చూసిన చూపు అన్నీ విలక్షణంగా ఉన్నాయి.

"ఎవరు కావాలి మీకు ?"

"మీరు !!"

మన్మథకు ఆమె ధైర్యం చూసి, భయం వేసింది. కుర్చీలో నుంచి లేచి నిలబడి "ఎందుకు ?" అని అడిగాడు. ఇంతకుపూర్వం అతనికి స్త్రీతో అనుభవం లేదు. మాతృమూర్తిగా మాత్రమే అతను పెట్టుకునే చెల్లెళ్లు మాత్రమే ఆడది తెలుసు. తను ప్రేమించగా తనను తిరస్కరించిన పడతిగా మాత్రమే, మగువ తెలుసు. ధనం కోసం మానధనాన్ని వ్యాపారంలో స్త్రీ ఉపయోగించడం అతనికి అశ్రుపూర్వం.

మన్మథ 'ఎందుకూ ?' అని అడగడం **ఆమెకు** నవ్వు తెప్పించింది. "ఇంత పసివాడవు, ఈ హోటల్లో ఎందుకు దిగావు ?" అని అడిగింది.

"పసివాణ్ణా ?" మన్మథ తెల్లబోయాడు.

"కాదా మరి ? ఆడది మగవాడి దగ్గరకు ఎందుకు వస్తుందో తెలినివాడివి పసివాడవు కాదా ?"

మన్మథ గబగబా పర్సు తెరిచాడు. ఒక పది రూపాయల నోటు తీసి ఆమె ముందు పడేస్తూ, "తీసుకుపో. ఆ డబ్బు తీసుకుపో. నే నటువంటివాణ్ణి కాదు. తెలీక ఈ హోటల్లో దిగాను. ఆ డబ్బు తీసుకుపో" **అన్నాడు తొందర తొందరగా.**

**ఆవిడ** వంగి **ఆ** పది రూపాయలనోటు తీసుకుంది. వంగినప్పుడూ, పూర్తిగా తన పూర్వపు అందాన్ని కోల్పోని ఆమె శరీరంలోని ఒంపులు. అతను కళ్లు మూసుకున్నాడు. ఆమె అతనికి దగ్గరగా వచ్చి, **బలవంతంగా అతని** చెయ్యి తీసుకుని ముద్దు పెట్టుకుంది. "తమ్ముడూ ! మా ప్రొప్రయిటరు నిన్ను అపార్థం చేసుకున్నాడు. అందరిలాంటి వాడివే అనుకున్నాడు. రేపొద్దున్నే ఈ హోటలు వదిలిపెట్టి వెళ్లిపో."

వెళ్లిపోతున్నది. మన్మథకు ఆమెను ఉండమందామనీ, ఆమె చరిత్రను తెలుసుకుందామనీ అనిపించింది. కాని వస్తా యించాడు. ఎవరి కన్నీరైనా ఉప్పగానే ఉంటుంది. పతిత అయిన ప్రతి స్త్రీ వెనకాలా ఒక పురుషుడు ఉంటాడు. ఇంతకన్నా తెలిసికోవలసింది ఏముంది ?" అన్న కుప్రిన్ వాక్యాలు అతనికి జ్ఞాపకం వచ్చి, తలుపులు వేసి వచ్చి పుస్తకం చదవబోయాడు. కాని చదవ బుద్ధిపుట్టలేదు. లైటు ఆర్పేసి, హోల్డాల్ క్రింద పరుచుకుని పడుకోబోయాడు. ఆలోచనలు కందిరీగల్లా కుడుతున్నాయి. రాత్రి, సగం నిద్రతోనూ, సగం ఆలోచనలతోనూ గడిపాడు.

మర్నాడు పొద్దున్న నిద్రలేచి, కాలకృత్యాలు తీర్చుకొని, పెట్టె, బెడ్డింగు తీసుకుని, బిల్లు చెల్లించి, బయటకు వచ్చేస్తూ, 'ఆమె' కన్పిస్తుందేమోనని అటూ యిటూ చూశాడు.

**"ఎవరు కావాలిసార్ ?" అన్నాడు** హోటలు ప్రొప్రయిటరు, పెదిమల వెనుక, కళ్లలోనూ నవ్వు దాచుకుంటూ.

"ఎవరూ అక్కర్లేదు."

రోడ్డుమీద నిలబడి, కాస్త రెస్పెక్టబుల్ గా కన్పిస్తున్న ఓ ముసలాయన్ను పిల్చి "ఈవూళ్లో 'నైట్ బిజినెస్' లేని హోటలేదైనా ఉంటే చెప్పండి" అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

"ఒకటి కాదు. కొన్ని పదులున్నాయి" అంటూ ఆయనేదో హోటలు పేరు చెప్పి, రిక్షావాడికి తనే బేరం కుదిర్చి

సౌకాటుకు మనసుకు కొంత విశ్రాంతి ఇచ్చేదిగా ఉంది. ఖరీదు సామాన్యులు భరించలేనిదిగా ఉన్నా, శుభ్రత విషయం లోనూ, సౌకర్యాల విషయంలోనూ లోపం లేకుండా ఉంది. "విశాఖపట్నం సామాన్యుల పాలిట కాశీపట్నం" అన్నమాట అతనికి జ్ఞాపకం వచ్చింది.

సామాన్లు గదిలో పెట్టుకుని, "ఈ యూనివర్శిటీలో చేరే యోగం ఎట్లాగూ లేదుకదా ? ఏ ఉత్తర హిందూదేశం యూనివర్శిటీలోనో తను చదివే యోగం ఉన్నట్లుంది. సాయంకాలం బండిలో కటక్, కలకత్తా మీదుగా తనిహా ప్రయాణము సాగించవచ్చు. ఈలోపల విశ్వనాథం, కరుణలతో కూడా ఈ సంగతి చెప్పేసి వస్తే తన బాధ్యత తీరిపోతుంది, చెప్పలేదన్న అపవాదూ తనకు ఉండదు" అనుకొని, ప్రొఫెసర్ నీలకంఠంగారింటికి బయలుదేరాడు. ఎవరో ఫలానా బస్సు ఎక్కిపొమ్మన్నారు. సిరిపురం క్వార్టర్స్‌లో ఫలానా నంబరు గల ఇల్లు అని ఓ స్టూడెంటు, అడ్రసు చెప్పాడు.

మన్మథ వెళ్ళేసరికి కరుణ వరండాలో జడ వేసుకుంటూ నిల్చుని ఉంది. ఆవరణ నిండా పూలమొక్కలు. మన్మథను చూడగానే, "రండి. రండి" అంటూ ఆహ్వానించి, లోపలకు తీసుకువెళ్ళి కూచో పెట్టి, "నాన్నగార్ని పిల్చుకొస్తాను. లోపలున్నారు" అంటూ లోపలికి వెళ్ళిపోయింది. మన్మథ గదిలో అమర్చిన ఫర్నిచరు చేసి చూస్తూ కూచున్నాడు. 'రివాల్వింగ్ రాక్' లో అందంగా దేశ, విదేశ సాహిత్యమంతా అమర్చబడి ఉంది. గోడలకు ఆయిల్ పెయింటింగ్స్ ముచ్చటగా ఉన్నాయి. సూర్యుని వెల్తురు పడే పోయూల గాజు తొట్టెలో అటూ యిటూ తిరుగుతున్న బంగారు చేపలు. రేడియో అతి సన్నగా మోగుతోంది. ఏదో ఫారిన్ మ్యూజిక్.

మన్మథ అన్నింటినీ పరిశీలనగా చూస్తుండగానే, నీలకంఠంగార్ని వెంటబెట్టుకుని, విశ్వనాథం ప్రవేశించాడు. ఇద్దరూ సమ వయస్కులుగానే కనిపిస్తున్నారు. నీలకంఠం తలంతా ముగ్గు బుట్టలా నెరిసిపోయింది. లావుపాటి పెదిమలు. కొస తేలిన ముక్కు. ఫ్రెంచికట్ మీసం. గోల్డ్ రిమ్డ్ కళ్ళజోడు. ఆయనను చూడగానే భయమూ, భక్తీ రెండూ ఏర్పడుతాయి.

"ఇతనే మా అమ్మాయికి బావా, మా అల్లుడికి అన్నయ్యా, నా స్నేహితుడి పెద్ద బిడ్డాను. పేరు మన్మథ. బియ్యే ప్యాసయ్యాడు" అంటూ పరిచయం చేశాడు విశ్వనాథం.

"నమస్కారమండీ !" మన్మథ లేచి



నిలబడి చేసిన నమస్కారానికి ప్రతి నమస్కారం చేస్తూ "కూచో. కూచో. నువ్వు యూనివర్శిటీలో చేరడానికి వచ్చావట కదూ ? ఏ గ్రూపు తీసుకుందా మనుకున్నావ్ ?" అని అడిగాడు ప్రొ. నీలకంఠం.

మన్మథకు ఆయనతో అబద్ధం చెప్పడానికి మనస్కరించలేదు. తాను తెలుగు ప్రొఫెసరు దగ్గరకు వెళ్ళిందీ, ఆయన తనకు దొరకదనీ ఖండితంగా చెప్పిన విషయము, ఆ తర్వాత తను హిస్టరీ ప్రొఫెసరుగార్ని కలుసుకోగా అక్కడ కూడా నిరుత్సాహపడ్డ వైనం, చివరికి విశాఖపట్నం వదలిపెట్టి వెళ్ళిపోదా మనుకుంటున్న వయినం, అంతా పూర్తిగా వివరించి చెప్పాడు. ఆయనకు మన్మథ దాపరికంలేని ప్రవర్తన నచ్చినట్లుంది, "నీ మార్కుల లిస్టుందా ?" అని అడిగాడు. "ఉందండీ!" మన్మథ తన మార్కులు ఆయనకు చూపించడానికి సిగ్గుపడుతూనే ఆ కాయితం చేతికి అందించాడు, లేచి నిలబడి.

ఆయన దాన్ని పరిశీలిస్తూ, "హో! రెగ్యులేషన్స్ కాండిడేట్‌వా ఏమిటి నువ్వు ?" అని అడిగాడు.

"అవునండీ !" అన్నాడు మన్మథ.

"అందులో లిటరేచరా నీది ?"

"అవునండీ!"

"అందులో సలక్షై అయినా వయ్యుంటే నాట్ బ్యాడ్."

మన్మథలో వాడిపోతున్న ఆశాలత చిగురించింది. "నేను ఇంతవరకూ అప్లికేషన్ కూడా పెట్టలేదండీ !" అన్నాడు తెలివితక్కువకు ఎంతో విచారిస్తూ.

"ఇదో ఫార్మాలిటీ అనుకో," అంటే

ప్రగతి ప్రెస్, విజయవాడ—1.



## కరుణ

వెళ్లి, నేను చెప్పానని చెప్పి అప్లికేషన్ ఫారం తెచ్చి, అది ఫిలప్‌చేసి, కాన్ఫిడెన్షియల్ సెక్షన్‌లో జకరయ్య అని మా యూడీసీ ఉన్నాడు. అతని చేతికి యిచ్చేసేయ్. డోన్ట్ వరీ ఎబవుట్ ది సీట్. హాస్టల్లో కూడా నేను చెప్పానని చెప్పి, 'వివేక విన్యాస' లో హో రూము తీసుకో."

"వివేక విన్యాస ఏమిటీ ?" విశ్వనాథంలో ఆసక్తి రేగింది.

"అదా ?-హాస్టల్‌లో ఒక బ్లాక్ పేరు. ఇక్కడంతా తమాషాగా ఉంటాయి పేర్లు హర్షవర్ధన, వివేక విన్యాస, వినయ విహార ఇట్లాగు!"

మన్మథకు, వీరభద్రం విషయం అడుగు దామని నోటిదాకా వచ్చింది. అయితే కొమ్ములు చూపించి బేరం చేసినట్లవుతుం దని మానివేశాడు. అతని భావాన్ని గ్రహించినట్లుగా విశ్వనాథమే అడిగాడు. వీళ్ల బావ మనోహ రున్నాడయ్యా ! అతనికి కూడా కాస్త సాయం చేసిపెట్టాలి !"

"లెట్ హిమ్ కమ్."

మన్మథకూ, విశ్వనాథానికీ కూడా అతను వూళ్లోనే ఉన్నాడనీ, తమనుంచి వేరుపడ్డా డనీ చెప్పడం ఇష్టంలేక వూరుకున్నారు. మన్మథ నమస్కారంచేసి, బయటకు వచ్చే శాడు. అతనికి క్షణం క్రితం జరిగింది కలో నిజమో తెలీని పరిస్థితి ఏర్పడింది. వరండాలోకి రాగానే కరుణ మరో అమ్మా యితో మాట్లాడుతూ కనిపించింది. ఆ అమ్మాయి తెల్లగా శలకలా ఉంది. చెవు లకు రింగులు. జుట్టు, అదేదో తమాషాగా ముడివేసుకుంది. చిన్న ముక్కు. చిన్న పెద వులు. పెద్ద కళ్లు. కొనతేలిన గడ్డం. ఆ అమ్మాయిని చూడగానే ఇన్ని విషయాలు ఒక్కసారిగా మనసు మీదుగా ముద్రవేసు కుంటాయి. ఎవరికి వారికి, వారివారి మన స్థితినిబట్టి ఆ అమ్మాయిమీద ఒక అభి ప్రాయం ఏర్పడుతుంది.

మన్మథ మనసు ఆ సమయంలో సంతోషం అనే రాయంచమీద విహరిస్తోంది, కనిపిం చిన ప్రతి ప్రాణి, ఆనందంగా, సుందరంగా కన్పిస్తోంది. ఈ జీవితంలో ఇహ విచారించ వలసింది ఏమీ లేదనిపిస్తున్నది. అతన్ని చూడగానే, కరుణ అతనికి దగ్గరగా వస్తూ, "కంగ్రాచ్యులేషన్స్ బావగారూ! ఇవాళ్టినుంచీ మనం బావా, మరదళ్లమే కాదు, క్లాసుమేట్సుం కూడా ! జస్ట్ ఎ మినిట్ ! ఈ అమ్మాయి సవిత, నీలకంఠం గారి పెద్దకూతురు. మనకు క్లాస్‌మేట్. ఎంత చక్కగా పాడుతుం దనుకున్నావ్! బెంగాలీ సంగీతంలో వస్తు."

"నమస్తే !" సవిత కంఠం వీణమీద విన్పించే పాటలోని వంకర్లను ఎరువు తెచ్చుకుంది.

"నమస్తే !" మన్మథ గొంతు అతనికే మోహనంగా విన్పించింది.

"కరుణకు మీరు బావగారుట ! కరుణ నాకు చెల్లెలికన్నా ఎక్కువ. అందుచేత—" అంటూ ఆగి, అర్థవంతంగా తల వంచి, కళ్లు మనుకు తెర్చి, "బావగారూ !—కాఫీ పుచ్చుకు వెళ్లరుగాని ఉండండి!" అంటూ లోపలికి వెళ్లిపోయింది.

సవిత వెళ్లిం తర్వాత, మన్మథ కరుణ వైపు చూస్తూ అన్నాడు. "కరుణా! నాకీ సీటు రావడానికి నువ్వే కారణ మనుకుంటు న్నాను. నిజమేనా ?"

"నూటికి నూరుపాళ్లు నిజంగా అబ్బాయ్ ! నేనన్నా కొంచెం తటపటా యించాను కాని, అదే నీ విషయం నీలకం ఠంతో చెప్పింది." అక్కడికి వస్తూ విశ్వ నాథం విషయం విడమర్చి చెప్పాడు.

మన్మథ కళ్లు చెమర్చాయి. "ఎంతో కృతజ్ఞుణ్ని కరుణా !"

"బంధువులమన్న తర్వాత, ఒకే కుటుంబం బంలోని వ్యక్తులమైన తర్వాత, ఈమా త్రము సహాయం కూడా చేసుకోలేకపోతే, ఇహ ఆ బంధుత్వానికి విలువే ఉండదు."

సవిత, పనిమనిషిచేత ట్రేలో మూడు కప్పుల కాఫీ పెట్టించి, తీసుకువచ్చింది అందరికీ కాఫీ సర్వ్‌చేస్తూ, "డాడీ ! మీరు కూడా రండి." అంటూ లోపల కూచున్న నీలకంఠంగార్ని ఆహ్వానించింది.

"డిపార్ట్‌మెంటల్ హెడ్స్ మీటింగొకటి

ఉంది. నోట్స్ ప్రిపేర్ చేసుకొంటున్నాను.” అంటూ ఆయన బయటకు వచ్చి, “నేను, ఎవరిమాటనైనా జవదాటగలను కానీ, ఒక్క సవిత మాట మాత్రం దాటలేక పోతు న్నానయ్యా విశ్వనాథం.” అన్నాడు నవ్వుతూ.

మన్మధ కాఫీ తీసుకుని, అందరి దగ్గరా సెలవు పుచ్చుకుని, రిజిస్ట్రారు ఆఫీసు వెతుక్కుంటూ వెళ్ళిపోయాడు. ఆ ఆఫీసులో కావలసిన గుమాస్తాను కలుసుకుని అప్లికేషన్ తీసుకుని, పూర్తిచేసి ‘సబ్మిట్’ చేయడానికి ఎంతోసేపు పట్టలేదు. అక్కణ్ణించి, అక్కడకు దగ్గర్లోనే ఉన్న హాస్టల్స్ ఆఫీసుకు వెళ్ళి, తాను ప్రొ. నీలకంఠం తాలూకు అని చెప్పుకుని ‘వివేక విశ్వాస’ మహాడ్లో అంతస్థులో కుడివైపు చిట్టచివరి గది తీసుకున్నాడు. అప్పుడు తెలిసింది ఆయనకు, నీలకంఠం యూనివర్సిటీ హాస్టల్స్ వార్డెనని, యూనివర్సిటీ ఆరేటరని, వైస్—ఛాన్సలర్ గారికి ప్రాణ మిత్రమని, బాగా ఆస్తిపాస్తులు సంపాయించినవాడని, సవితాదేవి ఒక్కతే కూతురని, మరో కొడుకు ఉన్నాడనీ అతను టెక్నాలజీలో మాస్టర్ డిగ్రీ పుచ్చుకుని ఇప్పుడు అమెరికాలో ఇల్లినాయిస్‌లో రీసెర్చి స్కాలరుగా ఉన్నాడని, మీదు మిక్కిలి ఆయన దయార్ద్రహృదయుడనీ, ఆయన జీవితం వడ్డించిన విస్తరి అనీను. మన్మధకు ఆయనతో ప్రత్యక్షంగా పరిచయం అయిన కారణంగా, ఆ విశేషాలన్నీ ఆయన యెడల సహజగుణాలే అనిపించింది.

యూనివర్సిటీలో యం. ఏ తో సీటు, లిటరేచర్’ లో సంపాయించుకుని, కష్టమేమీ లేకుండా హాస్టల్లో చక్కని రూమును రిజర్వు చేయించుకుని, ధరావతు కట్టి, మన్మధ ‘అప్‌లాండ్స్’’ లోంచి మళ్ళీ టవున్లోకి వచ్చాడు. అతనికి వీరభద్రాన్ని కలుసుకుందామనిపిస్తోంది. అయిన వాళ్లతో కలిసి ఆనందం పంచుకోవడంలోనే విశేషం ఉంది. కష్టం మనం ఒక్కరమే అనుభవించాలి, సుఖాన్ని మాత్రం ఇతర్లతో పంచుకోవాలి అన్నది అతని నమ్మకం.

‘టర్నర్ సత్రం’ దగ్గర బస్సు దిగి,

"ఏమిటి ?—డబ్బంతా పోయిందా ?"

"అవును! మామగారు ఇచ్చిన డబ్బంతా పోయింది. నువ్వే నాకు హెల్ప్ చెయ్యాలి. నీకోసం తిరిగి తిరిగి కాళ్లరిగిపోయి, తిండి తినక, ఇదిగో ఇక్కడకు వచ్చి కూలబడ్డాను. కరుణను చూద్దామంటే మొహం చెల్లలేదు. నా కింతకన్నా మరణమే నయమనిపిస్తోంది. నువ్వు హెల్ప్ చెయ్యకపోతే ఇహ నా గతి అంతే. ఇహ నేను మన వూరు పోను. ఎవరికీ నా మొహం చూపించలేను."

మన్మథకు ఏం చెయ్యాలో తోచడం లేదు. వీరభద్రం పెద్దగా ఏడ్పు మధ్య మధ్యలో ఎక్కిళ్ళు. జనమంతా తమ వైపే చూడడం. గబుక్కున కరుణ మాటలు జ్ఞాపకానికి వచ్చాయి. బంధువు లన్నవాళ్లు కష్టాల్లోనే సహాయం చేసుకోవాలి!" మన్మథ ధైర్యం తెచ్చుకున్నాడు. ముగ్గురికీ కాఫీ తెప్పించి "ముందు కాఫీ తాగు. షాక్ తగిలినప్పుడే ధైర్యంగా ఉండాలి. వెధవ డబ్బు! డబ్బును మనం సంపాయిస్తాం కాని, అది మనను సంపాయించదుగా ?" అన్నాడు.

అంతవరకూ ఏమీ మాట్లాడకుండా జరుగుతున్న నాటకాన్ని ప్రేక్షకుడిగా మాత్రమే ఆనందిస్తున్న సింహాద్రి అప్పుడు వాళ్ళ సంభాషణలో తనూ ఒక పాత్ర అయ్యేడు.

"అవును. అది నిజమే ! డబ్బును మనం సంపాయిస్తాం. సంపాయించటమేమిటి ?— కుక్కను కొడితే రాలుతుంది అది. మొన్నేమైందనుకున్నారు ?— ఖస్సు ఖస్సుమని దగ్గుతుంటే, మా దొడ్లో తిరుగుతున్న నో దేశవాళీ కుక్కకు రెండు తగిలించాను. క్రిందటి రాత్రి ఎవరింట్లోనో దొంగతనంగా తిన్న తిండంతా అది కక్కింది. ఆ కక్కుతున్న తిండిలో డబ్బులున్నాయి."

వీరభద్రం నవ్వలేదు. "నాకు కుక్క అంటే తగని భయం. వాట్ని కొట్టలేను." అన్నాడు.

"మీ రెందుకూ కొట్టడం ?—ప్రక్కన నే నున్నాగా, అతిరథ మహారథుణ్ని !!"

వీరభద్రానికి ధైర్యంచెప్పి ఆ ఇద్దరూ అతన్ని తీసుకుని, అతను బసచేసిన హోటలుకు వెళ్ళి, పోయిన డబ్బు విషయమై ఎంక్వయిరీ చేశారు. ఆ హోటలువాడు ఒక్కటే సమాధానం చెప్పాడు. "అయ్యా! ప్యాసింజర్లు గదుల్లో లేనప్పుడు మేము వాళ్ల సామాన్లకు హామీ ! ప్యాసింజర్లు గదుల్లో ఉండి, తలుపులు లోపల వేసుకోకపోతే, అడ్డమైనవాళ్లనూ లోపలికి రప్పించుకుంటే, వాళ్లతో రాత్రల్లా కులాసాగా కాలక్షేపం చేస్తే, అప్పుడు వాళ్ల దగ్గరేమైనా పోతే, మాదా తప్పు ?"

మన్మథ కళ్ళు చికిలించి వీరభద్రం వేపు చూశాడు. అతనికి తనకు రాత్రి జరిగిన అనుభవం జ్ఞాపకం వచ్చింది. తను దైవకృపవల్ల బయటపడ్డాడు. వీరభద్రం వోడిపోయి ఉంటాడు. ఇంతటి బలహీనుణ్ని కట్టుకుని కళ్యాణి ఏం సుఖపడుతుంది ?

మారు మాట్లాడకుండా వీరభద్రం సామాన్లు తీసుకుని, మన్మథ, సింహాద్రి తోనూ, వీరభద్రంతోనూ కలిసి తన గది దగ్గరకు వచ్చేశాక, అప్పలసామి వీరభద్రానికి షేక్‌హాండ్ యిస్తూ "నాకు తగిన ఫ్రెండువి భాయ్ ! నేనూ ఇట్లాగే మొదట్లో నో వంద రూపాయలు పోగొట్టుకున్నాన్లే. ఏం బాధపడకు. నావి వంద. నీవి ....." ఆగిపోయి, ఎవరూ మాట్లాడక పోవడం చూసి, "సరే, మళ్లీ కలుస్తా."

"మిస్టర్ భద్రం! డోన్ట్ వరీ" అంటూ వెళ్లిపోయాడు.

అతను వెళ్లిపోయిన తర్వాత, గబాలున మన్మథ చేతులు రెండూ పుచ్చుకుని "ఇవి చేతులు కావు. నన్ను క్షమించు" అన్నాడు కళ్లల్లో నీళ్ళతో వీరభద్రం. దాంతో మన్మథ మాట్లాడలేక పోయాడు.

"మామగారికి ఉత్తరం రాస్తాను. ముందు అవసరాలు గడవాలిగా ?—ఒక్క వంద రూపాయిలే చాలు."

ఇష్టంలేకపోయినా మన్మథకు ఆ డబ్బు ఇవ్వక తప్పిందికాదు. వీరభద్రం కలం నోట్లో పెట్టుకుని మామగారికి ఉత్తరం ఏవిధంగా రాయాలా అని ఆలోచిస్తూ కూచుండి పోయాడు. (సశేషం)



[illegible] లూనా—9, అమెరికన్ రేంజర్ 7, 8, 9 ప్రవే[illegible]
శంతో [illegible] ఫోటో-మాప్ ఆధారంగా వేసినది.

# చంద్రుడి కోనాలు పోగు

## డాక్టర్ మహీధర నళినీమోహన్

**రష్యన్** శాస్త్రజ్ఞులు పంపిన లూనా—9 అనే అంతరిక్ష నౌక ఫిబ్రవరి మూడవ తేదీని చంద్రమండలం మీదికి నింపాదిగా దిగినప్పటినుంచి యావద్ప్రపంచ వైజ్ఞానికలోకాన్నీ ఆశ్చర్యాంబుధిలో ముంచివేసింది. అది చంద్రునిలో "కెవిలేరియస్" అనే చంద్ర బిలానికి (క్రేటర్) సుమారు వంద కిలోమీటర్ల తూర్పుగా "తుఫానుల సముద్రము" లో వాలింది. అక్కడినుంచి టెలివిజన్ ద్వారా చంద్రోపరితలపు ఫోటోలు భూమిమీదికి పంపించసాగింది.

ఇది నూతనం, ఆశ్చర్యకరం, అపూర్వం అని ప్రపంచమంతా మెచ్చుకుంది.

[illegible] చేసిన [illegible] అందులో [illegible] ఏముంది ? అది సేకరించిన సమాచారం ఏమిటి ? తుఫానుల సముద్రం అన్నారే, చంద్రునిమీద సముద్రాలున్నాయా? గంటకు 18,000 మైళ్ల వేగంతో భూమిచుట్టూ ప్రదక్షిణాలు చేసిన కృత్రిమ ఉపగ్రహాలు భూమిమీదికి నింపాదిగా ఎన్నిసార్లు దిగలేదూ. చంద్రునిమీదికి నింపాదిగా దిగడంలో ప్రత్యేకత ఏముంది ?—ఇటువంటి ప్రశ్నలు చాలామంది అడుగుతున్నారు. ఈ విషయాలను ఈ వ్యాసంలో వివరించడానికి ప్రయత్నిస్తాను.

చంద్రమండల పరిశోధనల కోసం మొట్టమొదటిసారిగా (2—1—1959) రష్యన్ శాస్త్రజ్ఞులు "లూనా—1" అనే అంతరిక్ష నౌకను పంపించారు. అది దారి కొద్దిగా తప్పి, చంద్రుని చేరుకోలేక సూర్యుని చుట్టూ ప్రదక్షిణాలు చేయసాగింది. రష్యనులు రెండవసారి చేసిన ప్రయత్నముతో (14—10—1959) "లూనా—2" సరాసరి చంద్రుని ఢీకొంది. ఆ ఢీకొనడంలో ఆ అంతరిక్షనౌకా, దానితో బాటూ అందులో ఉన్న పరికరాలూ తుత్తునియలైపోయాయి. ఆ తరువాత "లూనా—3" చంద్రునికి బహు సమీపంలోకి వెళ్ళి, చంద్రుని వెనుకవైపును ఫోటోలుతీసి భూమిమీదికి పంపింది. ఎప్పుడూ చంద్రునిలో ఒక భాగమే మనకు భూమివైపు తిరిగి ఉంటుంది. ఆ రెండవ భాగం ఎలా ఉంటుందో ఎవ్వరికీ తెలియదు. చరిత్రలో మొట్టమొదటిసారిగా చంద్రుని వెనుకవైపు ఎలా ఉంటుందో లూనా—3 మనకు తెలియబరచింది. ఆవైపున ప్రత్యేకత ఏమీలేదు. మనకు కనిపిస్తున్న వైపున ఉన్నట్లే గోతులు, పర్వతాలు ఉన్నాయి. అమెరికన్ శాస్త్రజ్ఞులు పంపిన రేంజర్—7, రేంజర్—9 చంద్రునికి బహు సమీపంలోకి వెళ్ళి, చక్కని ఫోటోలు తీసి, చంద్రునికి సంబందించిన ఇతర సమాచారాన్ని భూమిమీది శాస్త్రజ్ఞులకు పంపించేయి.

సెకనుకి 7.1 మైళ్లను మించిన వేగముతో ప్రయాణించేసే రాకెట్లు భూమ్యాకర్షణను విడిపించుకుని, శాశ్వతంగా విశ్వావకాశంలోకి వెళ్ళిపోతాయి. అంతకు తక్కువ వేగమైతే కొంత ఎత్తు వరకూ ఎగిరి మళ్లీ భూమిమీద పడిపోతాయి. కనుక చంద్రుని చేరుకోవాలంటే ఇంతటి వేగాన్ని అందుకునే రాకెట్లు కావాలి. అటువంటివి రష్యన్, అమెరికన్ శాస్త్రజ్ఞుల దగ్గర పుష్కలంగా ఉన్నాయి.

చంద్రుడు మనకు సుమారు 2,38,000 మైళ్లదూరంలో ఉన్నాడు. అతడు భూమిచుట్టూ సెకనుకి 0.64 మైళ్ల వేగంతో తిరుగుతున్నాడు. ఇంత దూరంలో

ఇంత వేగంతో కదిలిపోతున్న ఈ వస్తువును రాకెట్టుతో కొట్టడానికి ద్రౌపదీ స్వయంవర సమయంలో మత్స్యయంత్ర ఛేదనంలో అర్జునుడు చూపిన కౌశలం కన్న ఎన్నోరెట్లు కౌశలం అవసరం. రాకెట్టును సెకనుకి 7.1 మైళ్లకన్న అధిక వేగంతో చంద్రాభిముఖంగా పంపించేసి ఊరుకుంటే చాలదు. భూమిమీది గాలి విసురుకి రాకెట్టు దిశ ఏ కొంచెం మారినా చంద్రుణ్ని వేలకొద్దీ మైళ్ల దూరం నుంచి దూసుకుపోతుంది. కనుక మధ్య దారిలో రాకెట్టు దిశను అవసరమైన మేరకు మార్పులు చేయగలగాలి. ఆపని భూమిమీద నుంచే చెయ్యాలి. అనుకున్న దిశను వదిలి రాకెట్టు ఏపాటి తప్పుగా ప్రయాణం చేస్తోందో ముందర తెలుసుకుంటారు. రేడియో ద్వారా రాకెట్టులోని యంత్రాలకు ఆజ్ఞలు పంపుతారు. ఆ ఆజ్ఞలనుబట్టి రాకెట్టు మోటారులు దిశను సరిచేస్తాయి. దీనికింత గ్రంథం ఉంది. శాస్త్రజ్ఞులు దీనిని కూడా సాధించారు.

దీని తరువాత అతి ముఖ్యమైన ఘట్టం చంద్రుని మీదికి రాకెట్టును నింపాదిగా దింపడం. గంటకు సుమారు 6000 మైళ్ల వేగంతో చంద్రుణ్ణి సమీపించే రాకెట్టు వేగాన్ని తగ్గించాలి. గంటకు పది మైళ్లకన్న వేగం అధికంగా ఉంటే రాకెట్టు, దానిలోని పరికరాలూ ధ్వంసమైపోతాయి.

భూమిచుట్టూ గంటకు 18000 మైళ్ల వేగంతో ప్రదక్షిణాలు చేసే కృత్రిమోపగ్రహాలను భూమిమీదికి దింపాలంటే, ముందుగా వాటి వేగాన్ని తగ్గించాలి. వేగం తగ్గించడానికి రాకెట్టు మోటారులు, గమనానికి వ్యతిరేక దిశలో పనిచేస్తాయి. వేగం కొద్దిగా తగ్గగానే రాకెట్టు ఎత్తు తగ్గి భూ వాతావరణంలో ప్రవేశిస్తుంది. గాలి రాపిడికి రాకెట్టు వేగం మరింత కిందికి దిగుతుంది. కిందికి దిగినకొద్దీ వాతావరణం దట్టం అవడంచేత వేగం బాగా తగ్గిపోతుంది.




ఈ బొమ్మలో చూపినట్టుగా రాకెట్టు నెమ్మదిగా భూమిని చేరుకుంటుంది. ఈవిధంగా రాకెట్టు వేగం తగ్గి నింపాదిగా భూమి మీద వాలడానికి భూమిచుట్టూ ఉన్న గాలి తోడ్పడుతుంది.

చంద్రునిమీద ఈ పద్ధతి పనికిరాదు. ఏమంటే చంద్రుని చుట్టూ గాలి లేదు. చంద్రుని ఆకర్షణశక్తి, భూమి ఆకర్షణ శక్తిలో సుమారు ఆరవ వంతు మాత్రమే. ఆకర్షణశక్తి ఇంత స్వల్పంగా ఉండడంచేత చంద్రాకర్షణను విడిపించుకుని గాలి అంతా క్రమక్రమంగా విశ్వావకాశంలోకి జారుకుంది. గ్రహం చిన్నది అయినకొద్దీ దాని ఆకర్షణశక్తి తగ్గుతుంది. కనుక చిన్నవిగా ఉన్న గ్రహాలు గాలిని నిలుపుకోలేవు. బరువుగా ఉండే పెద్ద గోళాల చుట్టూ మాత్రమే వాతావరణం ఉంటుంది,

గాలిలేని చంద్రమండలం మీదికి రాకెట్టును నింపాదిగా దింపాలంటే ఇంక ఒక్కటే మార్గం ఉంది. రాకెట్టు మోటారులను చంద్రునివైపు తిప్పి గమనానికి వ్యతిరేక దిశలో పని చేయించాలి. ప్రచండమైన వేగం అంతా పోయి రాకెట్టు బహు నెమ్మదిగా దిగేటంత వరకూ రాకెట్టు మోటారులు పని చేస్తూనే ఉండాలి. ఈపని చేయడానికి ఇంధనం చాలా కావాలి. ఒక్క కిలోగ్రాము బరువున్న ఇంధనం అదనంగా తీసుకవెళ్లాలంటే రాకెట్టు మొత్తం బరువు వెయ్యి కిలోగ్రాములు అధికం అవుతుంది. అందుకనే భూమిమీదికి దిగడంకన్న చంద్రుని మీదికి దిగడం ఎన్నోరెట్లు కష్టం. చంద్రునికి మీదికి దిగిన రాకెట్టును మళ్లీ భూమిమీదికి తీసుకరావాలంటే వందలకొద్దీ టన్నుల ఇంధనం అదనంగా కావాలి. రానూ పోనూ మొత్తం ప్రయాణానికి సరిపడే ఇంధనమంతా ఒకే ఊపులో భూమిమీద నుంచే తీసుకు వెళ్లాలంటే ఆ రాకెట్టు లక్షలకొద్దీ టన్నుల బరువు ఉంటుంది! అది ఎప్పటికి సాధ్యం అవుతుందో మరి. దానిని సాధిస్తేకాని మనిషిని చంద్రలోకానికి పంపడం సాధ్యం కాదు.

చంద్రమండలంమీద గాలి లేదు. నీరు అంతకుముందే లేదు. పగటి ఉష్ణోగ్రత +120 డిగ్రీలు సెం. గ్రే. అయితే రాత్రి ఉష్ణోగ్రత –160 డిగ్రీలు సెం. గ్రే. ఉంటుంది. పరిస్థితులు ఇంతదుర్భరంగా ఉండడంచేత చంద్రునిమీద జీవులేవీ లేవు. ఎక్కడ చూచినా ముదురు గోధుమ వన్నెలో రాళ్లు, బండలు, కొండలు, గోతులూనూ. భూమిమీద నుంచి టెలిస్కోపు ఉపయోగించి చూస్తే చంద్రుని మీద నల్లని మచ్చలు కనిపిస్తాయి. వీటిని చూచి పూర్వకాలపు ఖగోళ శాస్త్రజ్ఞులు అవి సముద్రాలు అని భ్రమపడి వాటికి మధు సముద్రం, తమస్సముద్రం, తుఫాను సముద్రం అని చిత్ర విచిత్రమైన పేర్లు పెట్టేరు. వాటిలో ఇప్పుడు నీరులేదు ఇప్పుడే కాదు, అసలు ఎప్పుడూ వాటిలో నీరులేదు. నీరులేదని తెలిసినా ఆ వెనకటి పేర్లనే ఇంకా వాడుక చేస్తున్నారు. కోట్లకొద్దీ సంవత్సరాలకు పూర్వం చంద్రుడు ఇంకా వేడివేడిగా పచ్చిపచ్చిగా, ఉన్న రోజులలో అక్కడ శిలాద్రవం (లావా) ఉండిఉండవచ్చు అగ్నిపర్వతాలు అధికంగా ఉండేవి. వా[illegible] వల్ల ఏర్పడిన గోతులు (క్రేటర్సు) చం[illegible] మండలం మీద అంతటా స్ఫోటక[illegible] మచ్చలులా కనబడుతూ ఉంటా[illegible] 200 మైళ్ల వ్యాసం మొదలుకొ[illegible] ఒక మైలు వ్యాసం గల గోతులు ఇప్ప[illegible] వరకూ 90 వేలు గుర్తుపట్టేరు.

చంద్రునిమీది గోతులు అన్ని అ[illegible] పర్వతాలవల్లనే పుట్టినవి [illegible] దమైన ఉల్కలు కరిగిఉన్న శిలా[illegible] సముద్రాలలో పడి ఈ గోతులు [illegible]

( 30 వ పేజీ చూడండి

కేజి పంచదార, ఏడాదికి 6 మీటర్ల గుడ్డ సప్లయి చేస్తారు. స్త్రీలు కూడా ఆ ఆరుమీటర్ల గుడ్డతో రెండు పైజమాలు రెండు పొట్టి 'బ్లాక్' చొక్కాలు తొడుగుకొని కాలక్షేపం చేస్తారు. అంటే కటాకటీగా రెండు జతలు తయారవుతాయన్నమాట. ఇవి సాధారణంగా అక్కడ తయారైన నల్ల సిల్కులో ఉంటాయి. చొక్కాలు పొడుగు చేతులవి కాని, మోచేతివరకు గాని ఉన్న "స్లాకులు" లాటివి కాని మెడతో కుట్టించు కుంటారు. అయితే వీరు మంచిరంగు కల్గి పసిమి బంగారంలా ఉంటారు. దక్షిణ వియత్నాం స్త్రీల లాగా నాజూకుగా కాక, వారికన్నా బలంగాను, గట్టిగాను కనిపిస్తారు. దీనికి వారి శరీర శ్రమయే కారణం అనిపిస్తుంది. ఇక్కడ స్త్రీలకు పెద్ద పెద్ద తలకట్లు ఉంటాయి. కొందరు యీ జుత్తు నంతా ముడివేసుకుంటారు. పిల్లకారంతా చాలా మట్టుకు 'బాబ్' చేసుకుని ఆ జుట్టును నవరాల క్రింద అమ్మివేస్తారు. మంచి నవరం 5 లేక 6 రూపాయల విలువ ఉంటుంది. స్త్రీలు కూడా పురుషుల వలెనే ఫ్యాక్టరీలలో గాని, పొలాలలోనూ, స్కూళ్లలోనూ, ఆసుపత్రులలోనూ, కొట్లలోనూ పనిచేస్తూ ఉంటారు. ఇక్కడివారి జీతాలు, వేతనాలు అన్నీ ప్రభుత్వం నిర్ణయించిన పద్ధతులలో నే ఉంటాయి. ప్రతి వ్యక్తికీ 'అక్షరాస్యత' ఉందనటం గొప్ప విషయం. 'నిశాని' పద్ధతు లేవిని ఇది గర్వించదగ్గ విషయం. ఆడ మొగా ఎక్కువగా సైకిళ్లు తొక్కుతూంటారు. ఇదే అందరికీ అందుబాటులో ఉన్న వాహనం. హెనాయిలో ట్రాములున్నాయి, సిటీ బస్సులు కూడా ఉన్నాయి. ఈ సైకిళ్లు చాలవరకు వీరి దేశం ఫ్యాక్టరీలలో తయారైనవే. ఇక్కడ 'లిప్‌స్టిక్' మేకప్ స్నోలు, పెర్‌ఫ్యూములు వేసుకుని, స్త్రీలు కనపడరు. అంటే అక్కడి స్త్రీలకు అలంకరణ తెలియక కాదు. ఇక్కడ కొట్లలో అవి ఎక్కువగా కనపడలేదు. అంటే దిగుమతులు రద్దు చేశారన్న మాట. ఇక్కడ సిగరెట్టు ఫ్యాక్టరీలు ఉన్నాయి. ఇంచుమించుగా చార్‌మినార్ సిగరెట్లువలె ఘాటుగా ఉంటాయి. అయితే యిక్కడివారు మత్తు రసాయ నాలు త్రాగరా! అనవచ్చు. త్రాగక కాదు. విదేశ పానీయాల దిగుమతి లేదు. ఇక్కడ బియ్యంతో ఒక రకం 'బీరు' తయారుచేస్తారు. అది పలావులే అవుతుందంటారు. ఇది బాగా ఘాటుగా ఉంటుం దట. ఇక్కడ రెస్టారెంట్లు పెద్ద పెద్ద అంద మైనవి కాకుండా మనదేశంలో లాగునే చిన్న సైజులో టవున్లలో కనపడే రెస్టారెంట్లు మాదిరి రెస్టారెంట్లు ఉంటాయి. ఇక్కడ టీ, అక్కడ వాళ్ళు తినే సేమ్యాలవలె ఉండే పదార్థంలో చిన్న మాంసంముక్కలు, కూరముక్కలు కలిపిన పదా ర్థము కప్పులలో అమ్ముతారు. అది తిని ఆ 'టీ' త్రాగుతారు. ఇది చప్పగానే ఉంటుందని చెప్తారు. ఈ 'టీ' గూడా పాలు వెయ్యకుండా 'డికాషన్' గా గూడా చాలామంది త్రాగుతారు.

ఫ్రెంచివారి శైలిలో కట్టిన ఆ పెద్ద పెద్ద హొటళ్ళలో ఇప్పుడు చాలవరకు కమ్యూనిస్టు చైనా నుంచి రష్యా, చెకోస్లోవాకియా, పోలెండు నుండి వచ్చిన సాంకేతిక నిపుణుల బృందాలు ఉంటూంటారు. వీళ్లతోటి కొద్దిమంది వియత్నా మీయులు మాట్లాడటం కనపడింది. బహుశా వారు వారితో కలిసి పనిచేసేవారై ఉండవచ్చు. ఇప్పుడు చెకోస్లోవేకియన్లు, రష్యావారు ఎక్కువగా కనపడరు. చైనావారే ఎక్కువగా కనిపిస్తారు. ఈ హొటళ్లన్నీ బాగా ఖాళీగా కనపడి పాత కోటల్లా కనపడతాయి.



కమ్యూనిస్టు రాజధాని హనాయి దృశ్యం

ఇక్కడివారి వినోదాలు కమ్యూనిస్టు దేశాలలో తయారైన ప్రచారానుకూలమైన చలనచిత్రాలు. ఇక్కడ ఉన్న కొద్దిపాటి సినిమాహాలుల్లో విడుద లవుతాయి. రేట్లు మాత్రం చవుకనే చెప్పాలి. ఈ ఫిలిములన్నీ ఆయా దేశాల ఆర్థిక, రాజకీయ రంగాలలో చైతన్యం కలగడానికి తోడ్పడుతాయి. ఇదిగాక అక్కడ ఫుట్‌బాల్, రన్నింగ్ రేసులు, స్విమ్మింగ్ పందాలు జరుగుతూంటాయి. వీరి సంగీత సాహిత్యాలు అన్నీ కూడా వారి రాజకీయ అవసరాలకు అనుకూలంగా వినియోగపడుతూం టాయి. హనాయి నగరంలో చక్కని కొలను లున్నాయి. ఇక్కడ పెద్ద పార్కులాగు ఉండడం దానిలో అక్కడక్కడ బెంచీలు, చెట్ల పొదలు పెద్ద వాహ్యాళికి యేతెంచిన భార్యాభర్తలు, యువతీ యువ కులు కానవస్తారు. అక్కడ వాళ్ళు జంటలుగా గడిపే సమయమే వారి ఆనందం. దీనికి కారణం లేకపోలేదు. ఇక్కడి ఇళ్లు చాలవరకు పెంకుటిళ్లు. గదీ వసారా, పోర్షన్లు ఎక్కువ. ఒక కుటుంబంలో ఒక ముసలి అమ్మా, నాన్నా లేక ముసలమ్మలు వల్లనైతే దుగురు పిల్లలూ భార్య భర్త జీవించాలి. ఇక్కడ కొంచెం మరుగు కావలంటే కష్టమే. అందువల్ల ఆ పార్కులలో వాళ్ళు కొంచం స్వేచ్ఛగా కాలం గడుపుతారు. ఇక్కడ నూతన గృహనిర్మాణాల పథకం అమలులో లేదు. దిగుమతి అయ్యే సిమెంటు, ఇనుమూ, అంతా వాళ్ళ దేశ పరిరక్షణ పథకాలకు సరిపోతుంది కాబోలు.

అసలు యిక్కడ ప్రతి వ్యక్తికీ ప్రభుత్వం ఒక 'సెక్యూరిటీ' కార్డు యిస్తుంది. దీనిలో ఆ వ్యక్తి పేరు, వయస్సు, వృత్తి, ముఖ్యంగా ఫోటో ఉంటాయి. అది ప్రతి వ్యక్తి తనవద్ద ఎల్ల ప్పుడూ ఉంచుకోవలసిందే. ప్రభుత్వ ప్రతినిధులు గాని, పోలీసువారు అడిగిన తక్షణం చూపించాలి. అది పోయినా, మరోవిధంగా పారేసుకున్నా ఆ వ్యక్తి చాలా యిబ్బందికి లోనవుతాడు. వెంటనే అక్కడి రక్షణాధికారికి పోయినట్టు, పోయిన విధానం ఫిర్యాదు చేసుకోవాలి. లేకపోతే ఆ వ్యక్తికి జైలు ప్రాప్తిగాని, దేశంలో యేమీ పండని, దొరకని ప్రదే శానికిగాని, బదిలీఅయ్యే శిక్షకుగాని పాత్రు డవుతాడు.

ఇక్కడి పిల్లలూ అన్ని దేశాల స్కూళ్లలో పిల్లలవలె చదవడం మామూలు విషయమే. అయితే, విద్యావిధానం మాత్రం వేరుగా ఉంటుంది. పిల్లలు స్కూలుకు వెళ్ళకపోతే తలిదండ్రులు దండింపబడుతారు. ఇంతకన్న ముఖ్యం వయో జనుల విద్యాభ్యాసం. ఈ స్కూళ్లు సాయంకాలం గాని, రాత్రిగాని జరుగుతాయి. వీళ్ళు ముఖ్యంగా హాజరు కావాలి. వీరికి చదువులో ముఖ్యముగా ఆ దేశ నాయకుల ఉద్బోధనలు, వారి దేశపు ఘన విజయాలు, వారి నిస్వార్థతరహిత జీవితాలు, వారి అచంచల కృషి, పెట్టుబడి వ్యాపార దేశాలలోని ప్రజల దుస్థితి, నైతికపతనం, తమ దేశాలలో నానాటికి పురోభివృద్ధి గాంచుచున్న ఆర్థిక, సాంఘిక వ్యవస్థ, కమ్యూనిస్టు యితర దేశాలలో ప్రజలు సాధించిన ఘన విజయాలు గురించి, దేశ చరిత్ర, ప్రజాస్వామ్యం గురించి ముఖ్యముగా బోధిత మవుతూంటాయి.

ఇక్కడ స్త్రీ పురుషులంతా (50 ఏళ్లలోపువారు) ప్రొద్దున్నే డ్రిల్లుకు హాజరవుతారు. [illegible] వాత వాళ్ళవాళ్ళ పనులమీద వెడతారు. పని సమయంలో గూడా ఉద్బోధనలు జరుగుతూం టాయి. ఇంక రేడియో ప్రసంగాలు ప్రొడ క్షన్లు చేస్తుంటారు. ప్రొద్దున్న సాయంత్రం

## వియత్నాం

విరామ సమయాల్లో యీ ఉద్బోధనలే. ఇలా అస్తమానం వినడం అంటే ఆ పరిస్థితి మీదే వూహించుకోండి. ఎలా బ్రతకడమో. ఈమధ్య దక్షిణ వియత్నాంలో జరిగిన మత కలహాలు, బౌద్ధులు పడే బాధలు గురించి తమ దేశంలో మతసామరస్యం ఎంతో ఉందన్నట్లు, ప్రభుత్వం అన్యమతాలకు తగు స్వేచ్ఛ యిచ్చినట్లూ, హనా యిలో జరిగిన మత విరశన ప్రదర్శనలూ, సభలూ చూస్తే తమకు సామాన్యపు రచన హక్కులు లేకపోయినా, ప్రభుత్వ ఆదేశానుసారం యీ వినాదాలు చేయవలసి వచ్చిందంటే ఎంత విచారకరమో మనకి తెలుస్తుంది.

ఇక్కడ పిన్నా, పెద్దా అంతపనీ చేయవలసిందే. మరీ పెద్దవాళ్ళు (వయోవృద్ధులు) పనిచేస్తుంటే బాధగా ఉంటుంది. ప్రజలలో దీనత్వం కనిపిస్తూంటుంది. నవ్వుతూ 'చలోసాలో' మంటూ ఎప్పుడూ కనపడరు. భగవంతుడు వీళ్ళకి మనశ్శాంతి, స్వేచ్ఛా ఆనందాలు ప్రసాదించాలని కోరదాము. ●

## చంద్రునికో...

(27వ పేజీ తరువాయి)

ఉండవచ్చునని కొందరు శాస్త్రజ్ఞుల మతం. లూనా—9 సేకరించిన సమాచారాన్నిబట్టి అగ్నిపర్వతాలవల్ల ఈ గోతులు ఏర్పడి ఉంటాయన్న సిద్ధాంతంవైపే మొగ్గు కనిపిస్తోంది.

చంద్రునిమీద అంతటా ఎక్కడ చూచినా దుమ్ము పొర ఒకటి కప్పి ఉంటుందనీ, ఈ దుమ్ము చాలా లోతుగా ఉంటుందనీ, చంద్రునిమీదికి దిగడానికి ప్రయత్నించిన అంతరిక్ష నౌకలు ఊబిలోకి బండిలాగ దిగబడి మునిగిపోయే ప్రమాదం ఉందనీ కొందరు శాస్త్రజ్ఞుల విశ్వాసం. లూనా—9 అందించిన సమాచారాన్నిబట్టి దుమ్ము ధూళి చంద్రుడిమీద లేదనీ, లావా త్వరగా చల్లబడినప్పుడు ఏర్పడే "స్పాంజి" ఆకారపు శిలలు, చిన్నచిన్న గులకరాళ్ళు మాత్రమే ఉన్నాయని తెలియవచ్చింది.

లూనా—9 అందించిన సమాచారాన్ని అంతనూ పరిశీలించి, చంద్రునికి సంబంధించిన కొత్తకొత్త విషయాలను రష్యను శాస్త్రజ్ఞులు త్వరలోనే ప్రకటిస్తారని ఆశిద్దాం. ●

# ఏనాకు ఖర్చు ఇప్పుడే ప్రారంభమౌతోంది. ముందుముందుకు దాచిపెట్టుకోడానికి ఇదే అదనుకాదా?



## జ్ఞాపకముంచుకోండి, నేషనల్ అండ్ గ్రిండ్లేస్ కుటుంబపు బ్యాంక్

మీ పాప పెరిగిన కొద్దీ మీకు ఖర్చులు పెరుగగలవు.

మీ పాప కోర్కెలు తీర్చడానికి, ఆమె పోషణకు, చదువుకు, దుస్తులకు, పుస్తకాలకు మీరు ఖర్చు పెట్టాలి.

పైగా పెళ్ళి ఖర్చు కూడా.

దానికి ఆధారంగా కలిగిస్తారా? నిజంగా?

నేషనల్ అండ్ గ్రిండ్లేస్‌లో పాప సేవింగ్స్ బ్యాంక్ అకౌంట్ ప్రారంభించండి.

అతి చిన్న మొత్తం రు. 5/-లతో కూడా మీరు ఖాతా ప్రారంభించవచ్చు. ప్రతినెలా ఆమెకోసం ఈ ఖాతాలో కొంత దాచుకోండి. మీ డబ్బు భద్రంగా వుండడమేగాక, ప్రతి ఏడాదికీ నూటికి 4 రూపాయల వడ్డీ కూడా అది సంపాదిస్తుంది.

పైగా మీ డబ్బు ఎప్పుడు పడితే అప్పుడు, మీ కవసరమైనప్పుడు మీరు తీసుకోవచ్చు.

జ్ఞాపకముంచుకోండి. నేషనల్ అండ్ గ్రిండ్లేస్ మీ బ్యాంక్. కాబట్టి మేము కుటుంబానికి సేవచేస్తాం కదా.



## నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్ లిమిటెడ్

యునైటెడ్ కింగ్‌డమ్‌లో ఇన్‌కార్పొరేట్ చేయబడింది ● మెంబర్ల బాధ్యత పరిమితం

అసోసియేటెడ్ బ్యాంకులు: లాయడ్స్ బ్యాంక్ లిమిటెడ్ ● నేషనల్ ప్రావిన్షియల్ బ్యాంక్ లిమిటెడ్

బ్రాంచీలు: మద్రాసు: 3, నార్త్ బీచ్ రోడ్: 378, నేతాజీ సుభాష్ చంద్రబోస్ రోడ్డు, (లాయిడ్స్ బ్రాంచి); 6, ఆర్మీనియన్ స్ట్రీట్: 158, మౌంట్ రోడ్డు. హైదరాబాద్: అబీద్ రోడ్.



# అనుబంధం

రంగధామ్

విశాఖపట్నం నుంచి క్రిష్ణమూర్తి రాసిన ఉత్తరం చదువుకుని తెగ మురిసిపోయింది సత్యవతమ్మ. "వెర్రినాగన్న! నన్ను వదిలి ఒక్క నిముషం ఉండలేడు. పొద్దున్న లేచిన దగ్గర్నుంచీ రాత్రి పడుకునేవరకు వాడికి అన్నీ నే అమర్చాల్సిందే. ఏపనీ చాతకాదు. భోజనం చేసేటప్పుడు కూడా నేను ప్రక్కనుండి ఇవీ అవీ చెప్పి తినిపించాలిసిందే. పాపం! అక్కడ ఏమవస్థ పడుతున్నాడో ఏమో!" అని ప్రక్కయింటి రత్తమ్మతో మాట్లాడుతూ అంది.

"అవును మరి. నెలల పిల్లడి దగ్గర్నుంచి నువ్వే పెంచావు. తల్లి నెరుగడు కాని నిన్నే తల్లనుకున్నాడు. బుద్ధిమంతుడు గాబట్టి చదువుకుని వృద్ధిలోకి వస్తున్నాడు. మరి రంగణ్ణి అలాగే పెంచావు. మరి వీడు ఇంకా పరీక్షలు తప్పుతూనే ఉన్నాడు." అంది రత్తమ్మ.

ఇప్పటికే ఏభైయ్యేళ్ళు దాటాయి. సత్యవతమ్మ భర్త పోయి పదిహేనేళ్ళయింది. ఆమెకు సంతానం లేదు. భర్త మరొక రెండేళ్ళకు పోతాడనగా చెల్లెలు సీతమ్మ ఇద్దరి పిల్లలతో, నిరాధారంగా అక్క దగ్గరకు వచ్చేసింది. చెల్లెల్నీ, చెల్లెలి బిడ్డల్నీ ఆదరించి అభిమానించింది సత్యవతమ్మ. చెల్లెలి కొడుకు కృష్ణమూర్తి. కూతురు కమల. మరొక రెండేళ్ళలో భర్త చనిపోతూ దగ్గర బంధువుల అబ్బాయి రంగయ్యనే కుర్రవాణ్ణి దత్తత చేసుకున్నారు.

మనుషులలో అభిమానాలూ, మమతలూ ఎలా పెద్దవుతాయో ఎవరికీ తెలియదు. పెంచుకున్న కొడుకైన రంగయ్యమీదకన్నా, చెల్లెలి కొడుకైనా కృష్ణమూర్తిమీదే ఆవిడ కెక్కువ అభిమానం. దానికి కారణం ముఖ్యముగా పైకి కన్పించేది, కృష్ణమూర్తి పెత్తల్లిమీద చూపించే విపరీతమైన అభిమానం. ప్రతి పనికీ అతను పెత్తల్లిని అనుమతి అడుగుతాడు. అన్నిపనులు పెత్తల్లికి చెప్పి చేస్తాడు. మాటలు వచ్చిన దగ్గర్నుండీ, "పెద్దమ్మా! ఏ బట్టలు తొడుక్కోమంటావు?" "పెద్దమ్మా, చదువుకోనా?", "పెద్దమ్మా, ఆడుకోనా?" అని పెత్తల్లి అడుగుజాడలలో నడుస్తూ ఆవిడకు సంతోషము కలుగజేస్తూ నడుచుకుంటాడు. కమల కూడా అదేవిధంగా అన్ని విషయాలలోనూ పెత్తల్లి ననుసరిస్తూ వాళ్ళిద్దరికీ తల్లి చాలా చిన్నతనంలోనే కరువవడంవల్ల, పెత్తల్లి మీదే ఆధారపడి పెరిగారు.

సత్యవతమ్మకు చాలా ఆస్తి ఉంది. ఆమె మనిషి చాలా చక్కనిది. మనసు కూడా మంచిదే. అఖండమైన తెలివితేటలు గల వ్యక్తి. బంధువుల నాదరించటంలోనూ, పేదవారి కుపకారం చెయ్యటంలోనూ ఆమెకు ఆమే సాటి. ఎన్నో తీర్థయాత్రలు చేసింది. ఆయుర్వేద వైద్యం, జ్యోతిషం, వేదాంతం మొదలైన వాటన్నిటిలోనూ కొంత ప్రవేశం కల వ్యక్తి. ఆ చుట్టుప్రక్కల వారందరికీ ఆమే ఉచితంగా మందు లిచ్చేది. శ్రీకాకుళంలో ఆమెకు మూడిళ్ళున్నాయి. తనకు సంతానం లేకపోయినా ఎంతమంది పిల్లలకో సాయం చేసింది.

తన చేతులతో పెంచిన చెల్లెలి పిల్లలిద్దరియందూ ఆమెకు గల మమకారం సాటిలేనిది. తన దత్తపుత్రుడైన రంగడియందు ఆమెకు అంత మమకారం లేకపోవడానికి అతని ప్రవర్తన కూడా కొంత కారణం కావచ్చు. వా డెప్పుడూ అల్లరి చిల్లరిగా తిరుగుతూండేవాడు. వాడికి చదువు సరిగ్గా అబ్బలేదు. స్కూలు ఫైనలు రెండుసార్లు తప్పాడు. ఇంటికెప్పుడు వస్తాడో, ఎప్పుడు వెళ్తాడో తెలియదు. సత్యవతమ్మ వాడి విషయం పట్టించుకోవ

దమే మానేసింది. పిల్లగాడితో తోడబుట్టిన గడ్డ పెరుగు కృష్ణమూర్తికి తను స్వయంగా దగ్గర కూర్చుని కృష్ణమూర్తి చేత తినిపిస్తే, రంగడికి పల్చని మజ్జిగ కూడా కరువయ్యేది. ఆదరంతోనూ, ఆప్యాయత తోనూ కృష్ణమూర్తి పెరిగితే నిర్లక్ష్యం తోనూ, దెబ్బలతోనూ రంగడు పెరిగాడు.

చెడు సావాసాలలో పడి చెడు తిరుగుళ్ళు తిరుగుతున్నాడని తెలిసి రంగడి విషయం ఆమె నిరక్ష్యం చేసింది. ఉద్యోగంలో ప్రవేశ పెట్టించాలని ప్రయత్నించింది. ఏవేవో చిన్న చిన్న ఉద్యోగాలు నాలుగైదు చేశాడు. దేనిలోనూ స్థిరంగా ఉండలేదు. వాడికి ఇరవై యేళ్ళు దాటి, ఇరవై ఒకటో ఏడు వచ్చాక, పెళ్ళిచేస్తే కొంత స్థిరత్వం వస్తుందని అందరూ అనసాగారు. అప్పటికి కృష్ణమూర్తి విశాఖపట్నంలో ఎం. ఏ. పాసయి, ఉన్న వూరైన శ్రీకాకుళం కాలేజిలో లెక్చరరుగా చేరాడు. అతనికి కూడా పెళ్ళిసంబంధాలు వస్తున్నాయి. పెత్తల్లి ఏది చెప్తే అది చేస్తాడని అందరికీ తెలుసు కాబట్టి, పెద్ద పెద్ద వారంతా వేలకొద్దీ కట్నాలిస్తామని వస్తున్నారు, ఆమెపట్నుకు! తమ పిల్లల్ని చేసుకోమని ప్రార్థిస్తూ.

చిన్నప్పటినుండీ అన్ని విషయాలలోనూ పెత్తల్లి మాట ప్రకారం నడుచుకోవటం అలవాటయిన కృష్ణమూర్తి, పెళ్ళి విషయంలో కూడా ఆమెకే నిర్ణయాధికారం వదిలేశాడు. కాని చాలాకాలం నుండీ అతని మనస్సులో ఒక కోరిక ఉంది. అతని హృదయం ఒక అందమైన పిల్ల ఆకర్షించింది. ఆ పిల్లని చూసినప్పుడల్లా అతని మనస్సు రెపరెప లాడుతుండేది. విశాలమైన కన్నులు, మెరిసే ఎర్రటి చెక్కిళ్ళు పొడుగాటి జడా, సన్నని నడుమూ గల ఇందిర అనే పద్దెనిమిదేళ్ళ అమ్మాయి, వీళ్ళుంటున్న వీధి చివర ఇంట్లో ఉంటున్న ఒక బీద స్కూలు మాష్టారి మూడో అమ్మాయి. ఆమె పద్నాలుగో ఏట నుండి కృష్ణమూర్తి మనసులో తిరుగుతూ కళ్ళల్లో మెదులుతుండేది ఆమె రూపం. ఇందిర తన విశాలమైన కళ్ళతో, కృష్ణమూర్తిపైపు చూసిందంటే, ఆ రాత్రి కృష్ణమూర్తికి సరిగ్గా నిద్రపట్టేదికాదు. ఇందిరను పెళ్ళిచేసుకుంటానని, పెత్తల్లితో అనేకసార్లు చెప్పాలని ప్రయత్నించాడు. కాని తనంత తను ఒకమ్మాయిని పెళ్ళి చేసుకుంటానంటే పెత్తల్లి ఏమంటుందో అని చాలారోజులు భయపడి వూరుకున్నాడు. చివరికి ఒకరోజున సత్యవతమ్మ ఏవో పెళ్ళి సంబంధాల గురించి మాట్లాడుతూంటే, తనే మెల్లిగా ఇందిర సంగతి కదిపాడు. గట్టిగా తనకా అమ్మాయిని చేసుకోవాలని ఉందని చెప్పలేకపోయినా, ఆమె అందం గురించి పొగిడాడు. ఆ పిల్లను చేసుకుంటే బాగుంటుం దన్నట్లు సూచించాడు.

"ఆ, వాళ్ళకేముందిరా. తిండికే సరిగ్గా లేక అవస్థ పడుతున్నారు. వాళ్ళు కట్నం ఏమిస్తారు? లాంఛనాలేం జరుపుతారు? మనకు తగిన సంబంధం ద్రాక్షారం జమీందారుగారిదేరా. పదివేలు కట్నం ఇస్తామంటున్నారు. లాంఛనాలన్నీ జరుపుతామంటున్నారు. పిల్ల చామనచాయగా పార్వతీ దేవిలా ఉంటుంది...."

ఇక కృష్ణమూర్తి వినలేకపోయాడు. మనసులో మెరిసిన ఇందిర, నాయిలు ప్లేటు వెలుగులో మొహం పెట్టుకుని ఘోరున ఏడవ్వాలనిపించింది అతనికి.

రంగడికి కూడా పెళ్ళి సంబంధాలు వస్తున్నాయి. కాని కృష్ణమూర్తికి వచ్చినంత పై స్థాయిలో రావడంలేదు. ముఖ్య కారణం బంధువు లందరిలోనూ, సత్యవతమ్మ తన ఆస్తి నంతా కృష్ణమూర్తికే చెందేట్లు చేస్తుందనీ, రంగడి కేమీ ఇవ్వదనే అభిప్రాయం కలిగింది. ఆమె భర్త ఆమెకు సర్వాధికారాలతోనూ వీలు వ్రాశాడు. అంతేకాక భర్త పోయినప్పుడున్న ఆస్తిలో సగమే మిగిలింది, కృష్ణమూర్తి చదువు పూర్తయ్యేసరికి. కమల పెళ్ళికి చాలా డబ్బు ఖర్చయింది. పైగా బంధువులు వచ్చి నెలల కొద్దీ తిష్ఠ వెయ్యడం అంతా ఆడపెత్తనం అవడంవల్ల, ఆస్తి సగం హరించడంలో విశేషమేమీలేదు. చివరికి రంగడికి మిగిలేదేమీ ఉండదన్నీ, వాడిని ఆవిడెల్లాగూ సరిగ్గా చూడదని అంతా గ్రహించారు. సత్యవతమ్మకు కూడా రంగడికి చదువు లేకపోవడంవల్లా, అల్లరి చిల్లరిగా తిరుగుతున్నాడనీ, వాడికి తగిన సంబంధం రాదనీ తెలుసు. అందువల్ల వాడి విషయంలో తనేమీ పట్టించుకో దల్చుకోలేదు. ఆమె దృష్టి ఎంతసేపూ ఎం. ఏ. పాసయి లెక్చరరుగా, నలుగురి దృష్టినీ ఆకర్షిస్తున్న కృష్ణమూర్తిపైనే ఉంది. అతని వివాహం ఘనంగా జరగాలి.

అనుకున్నట్లుగానే కృష్ణమూర్తి వివాహము ద్రాక్షారం జమీందారుగారి అమ్మాయితోనే జరిగింది. అతనికి వచ్చిన కట్నం పదివేలూ బ్యాంకులో అతని పేరనే వేసి, పెళ్ళి ఖర్చు తనే భరించింది. ఆ దంపతుల్ని చూసినవారంతా శివ పార్వతులలా ఉన్నారన్నారు. కృష్ణమూర్తి పొడుగ్గా తెల్లగా ఉంటాడు.

ఈ పెళ్ళి జరిగిన కొద్ది రోజులకు ఒకనాడు తమ వీధి చివర ఉండే స్కూలు మాష్టారు తనతో మాట్లాడడానికి వస్తే, కొద్దిగా ఆశ్చర్యపడింది సత్యవతమ్మ. అతడు తన మూడో కూతురైన ఇందిరను రంగడికిచ్చి వివాహం చేసుకోమని అడిగాడు. దానికి కారణం రంగడే స్వయంగా ఆయన వద్దకు వెళ్ళి, తాను ఇందిరను వివాహం చేసుకుంటానని చెప్పడమేట. ఈ సంగతి విన్నప్పుడు ఆమెకు చాలా కోపం వచ్చినా, కొద్దిసేపు ఆలోచించిన తరువాత, ఆమె ఈ వివాహానికి అంగీకరించింది. రానురాను రంగడి చేష్టలు ఆవిడని విసిగిస్తున్నాయి. పెళ్ళాం వస్తేనైనా బాగుపడవచ్చు ననుకుంది. పైగా వాడు క్రిష్ణమూర్తిలా తను చెప్పిన మాట వినే రకం కాదు. అందుచేత వాడిష్టప్రకారమే చేయదల్చింది. రంగడికి అంతకన్నా మంచి సంబంధం రాదనుకుంది.

రంగడి వివాహం నిరాడంబరంగా జరిగిపోయింది. కోడలికి పది తులాల బంగారం పెట్టింది సత్యవతమ్మ. లోకం మాత్రం రంగడి పెళ్ళిని కృష్ణమూర్తి పెళ్ళితో పోల్చి చూసుకుని సత్యవతమ్మ పక్షపాత దృష్టి నాడిపోసుకున్నారు.

కొద్ది నెలల తేడాలో ఇద్దరు కోడళ్ళూ కాపరానికి వచ్చారు. కృష్ణమూర్తి భార్యపేరు వరళ. వాళ్ళిద్దరికీ పడకగది మేడ పైన. అసలే ఆమె జమీందారుల బిడ్డ. దానికి తోడు లెక్చరరుగారి భార్య. అందు వల్ల ఆమే, ఆమె భర్తా, భోజనానికి తప్ప క్రిందికి రావేరారు.. కాఫీ ఫలహారాలు, సత్యవతమ్మే వారికి మేడమీదకు పంపుతుంది. ఇరవై నాలుగ్గంటలూ, పకపకలూ, వికవికలూ, సంగీతాలూ, షోకు చేసుకోడాలతో వారికి కాలం గడుస్తోంది. అన్ని విధాలా హుషారుగా తనను ఆనందింపజేస్తున్న వరళతో కాలం బాగా గడుస్తున్నా, కృష్ణమూర్తి మనసులో మాత్రం ఇందిర రూపం తొంగిచూస్తుండేది. వరళ స్థానములో ఇందిర లేకపోవడానికి కారణం తనకు రంగడికున్న తెగింపు లేకపోవడమేకదా—అని బాధపడేవాడు.

క్రింది భాగంలో, మునుపు కొట్టుగదిగా ఉండే, ఒక మూల గదిని రంగడికీ, ఇందిరకూ పడక గదిగా ఇచ్చింది సత్యవతమ్మ. ఎన్నో ఆశలతో ఆ యింట్లో అడుగు పెట్టిన ఇందిర, తన భర్తకు ఆ ఇంట్లో జరుగుతున్న అన్యాయానికి ఆశ్చర్యపోయింది. తను మునుపు కొంత వింది. కాని ఇప్పుడు కనులారా చూస్తోంది. తన స్థానం ఆ యింట్లో, ఆమెకు కొద్ది రోజులలోనే బోధ పడింది. ఒక దాసీదానికున్న విలువ కూడా తనకు లేదు. ఎంతసేపూ క్రిష్ణమూర్తికీ, అతని భార్యకూ ఏమి లోటు జరుగుతుందో అని సత్యవతమ్మ కొట్టుకుపోయేది. రంగడు ఏవేళప్పుడు వచ్చి భోంచేస్తాడోనని—ఒక్క ఇందిరకు తప్ప మరెవరికీ అక్కర లేదు. రెండుపూటలా భోజనానికీ, రాత్రి పడకకీ తప్ప రంగడు ఆ యింట్లో కనిపించనే కనిపించడు. పగలల్లా ఎక్కడ తిరుగుతాడో ఎవరికీ తెలియదు. ఈ యింటి యజమానైన రంగడికోసం, అందరికీ వడ్డించగా మిగిలిన భోజనం ఒక పళ్లెములో పెట్టి ఒకమూల ఉంచేవారనీ, ఏ ఝాములోనో వచ్చి రంగడు అది తిని పోయేవాడనీ తెలుసుకుంది.

కాపురానికి వచ్చిన ఆరు నెలల దాకా

# అనుబంధం

ఇందిర, ఇంట్లోని పరిస్థితులన్నీ చూస్తూ వింటూ, ఓర్పు పట్టింది. కాని ఇక భరించ లేకపోయింది. ఒకనాటి రాత్రి రంగడికి నిద్రలో మెలుకువ వచ్చింది. ప్రక్కకి చూసే సరికి ఇందిర వెక్కివెక్కి ఏడుస్తోంది. రంగడి మనస్సు కరిగిపోయింది. ఇందిరను తన చేతుల్లోకి తీసుకుని కారణం అడిగాడు. ఆమె మరింతగా ఏడుస్తూ "మన గతి ఇంతేనా ?" అని గట్టిగా ఏడ్చేసింది.

రంగడికంతా అర్థమైంది. తను ఈ ఇంటి వాతావరణానికి అలవాటు పడిపోయాడు. తన హృదయం మొద్దుబారి పోయింది. కాని అది ఇందిరకు ఎంత బాధ కరంగా ఉంటుందో తను గ్రహించలేదు. ఇందిర ఏడ్పుతో తనకు కనువిప్పయింది. ఆమెను ఓదారుస్తూ, ఆమెను కొద్ది రోజులు ఓపిక పట్టమనీ, తొందరలోనే తనీ సమస్యను పరిష్కరిస్తాననీ చెప్పాడు రంగడు. మంచి ఆలోచనాపరుడుగా, చాలా తెలివితేటలు గలిగినవాడు. కాని మహా సాహసి. దేనినైనా ఎదురించి ఫలితాన్ని పొందే రకం. ఎవ్వరూ చెయ్యలేని కార్యాల్ని చేసి సాధించడంలో తృప్తి పొందుతాడు గాని, అందరూ నడిచే బాటను నడవడాని కిష్టపడడు. అటువంటి స్వతంత్ర వ్యక్తిని స్కూల్లో టీచర్లు గాని, ఇంట్లో తల్లి దండ్రులు గాని, బయట పెద్దలు గాని అభిమానించి దగ్గరకు తియ్యరు. స్కూలు టీచర్లు తమ మాట వినటంలేదనే అక్కసు



కొద్దీ పరీక్షలు ఫేలు చేస్తారు. తల్లి దండ్రులు, ఎంతో సంస్కారం ఉంటే తప్ప అటువంటి పిల్లల్ని అర్థం చేసుకుని సరియైన దారిలో పెట్టి ప్రోత్సహించరు. బయటవారు, వాణ్ణి పొగరుబోతనీ, తప్పుడీ యనీ అంటారు. రంగడు తప్పుడీ కుర్రాళ్ళకు నాయకుడు. స్కూల్లో చదివినంత కాలం, మాస్టర్లనూ, ఆడపిల్లల్నీ తెగ ఏడిపించాడు. వాణ్ణి అదుపులో పెట్టాలని సత్యవతమ్మ ఎంతో ప్రయత్నించి, చివరకు ఏమీ చెయ్యలేక వదిలేసింది. కొన్నాళ్ళ, చదువు మానేసేక, అన్ని దురభ్యాసాలకూ లోనై, రెండు మూడేళ్ళు తెగ తిరిగాడు. మళ్ళీ ఆ దురభ్యాసాలన్నీ మానుకుని మామూలు మనిషై, పెళ్ళి చేసుకున్నాడు. అలా ప్రపంచం అనే గ్రంథాన్ని తాపీగా చదివి వింతలు తెలుసుకునే ఓపికలేక, గబగబ పేజీలు తిప్పి సారాంశాన్ని తెలుసుకున్నాడు. చివరికి వేదాంతం తనకు కూడా పట్టింది. ఏదెలా జరిగితే అలా జరగనీ—అనే స్థితిలో వివాహం చేసుకున్నాడు. భార్యతో ఆర్నెల్లు కాపురం చేశాక, మళ్ళీ—వేదాంతపు మత్తు వదిలి—సామాన్య సంసారయ్యాడు.

అప్పటికి రెండుసార్లు, బిజినెస్ చేస్తానని సత్యవతమ్మ వద్ద పదివేలదాకా డబ్బు పట్టిగెళ్ళి, తగలెయ్యడంవల్ల, రంగడు మళ్ళీ ఆమెను డబ్బడిగితే చిల్లిగవ్వ ఇవ్వనంది. గత్యంతరంలేక ఉద్యోగంలోనే చేర దలిచాడు. అదీ, ఆ చుట్టుప్రక్కల ఎక్కడా దొరక్క, దూరపుబంధు వొకాయన బెజవాడలో ఒక టీ కంపెనీలో సేల్సుమాన్‌గా ఉద్యోగం వేయిస్తే వెళ్ళి చేరాడు.

దత్తపుత్రుడు తనకు శాంతి సౌఖ్యాలను చేకూర్చకపోయినా చెల్లెలి కొడుకైన కృష్ణమూర్తి ద్వారానే తన ముద్దు ముచ్చటలు తీర్చుకుంటూ కాలం గడపసాగింది సత్యవతమ్మ. ఆమెకు తను చెప్పినట్లు నడుచుకుంటున్న కృష్ణమూర్తే రంగడికన్నా ముఖ్యు డనిపించింది. కాని, తనకు పెత్తల్లి నాశ్రయిస్తేనే కాని, కాలం గడవదని చిన్నతనంలోనే గ్రహించి, మనసులో యిష్టం ఉన్నా లేకపోయినా, పెత్తల్లి చెప్పినట్లు

వినకపోతే తనొక అనాధననీ, నిరాశ్రయురాలననీ, వేరే గత్యంతరంలేక, కృష్ణమూర్తి తన నాశ్రయించాడని ఆమె తెలుసుకోలేదు. సత్యవతమ్మ చెల్లెలు తన కొడుకును దత్తత చేసుకుంటా రనుకుంది—అక్కా, బావానూ. కాని వాళ్లు రంగణ్ని దత్తత చేసుకున్ననాడే, తమకా యింట్లో స్థానం లేదని గ్రహించారు కమలా, కృష్ణమూర్తీను. వారికి చేతనయినదల్లా పెత్తల్లిని పూర్తిగా లొంగదీసుకుని తమ పబ్బం 'గడుపుకోవటమే. ఎంత తెలివైనవారైనా, పొగడ్తకు లొంగడం లోకంలో ఉన్నదే. సత్యవతమ్మ కూడా అలాగే లొంగిపోయింది. తనంటే కృష్ణమూర్తికీ, కమలకూ ఎంతో అభిమాన మనుకుంది.

కాలగర్భంలో ఇరవైయ్యేళ్లు కలిసిపోయాయి.

కృష్ణమూర్తి ఆరుగురు పిల్లల తండ్రయ్యాడు. ఈ ఇరవైయ్యేళ్లలోనూ సత్యవతమ్మ ఆస్తంతా, ఒక్క మేడ తప్ప పూర్తయినట్లే. ఆమెకు వృద్ధాప్యం వచ్చింది. తియ్యగానే కబుర్లు చెప్తూ, ఇంట్లో నౌకర్ల నందర్నీ మానిపించి సత్యవతమ్మకి వంట అప్పగించింది సరళ. మునపటిలా ఆదరంగా పలకరించడం మానేశాడు కృష్ణమూర్తి. మేడను చాలాకాలం క్రిందటే రంగడి పేర రాసింది. అందువల్ల ఇక ఆమెవద్దనుండి తమకు ముట్టేదేమీ లేదని గ్రహించారు కృష్ణమూర్తి కుటుంబం. ఆమెను ఎలా వదుల్చుకోవాలా అని ఆలోచించసాగారు. ఇంటిల్లిపాదీ ఆమెను ఆమెను, సన్నసన్నగా విసుక్కోవడం ప్రారంభించారు. నడుం వంగిపోయినా, దేహం వడివడిలిపోయినా, అలాగే సాగుతూ వంటచేసిపెడుతూంటే, మనవలు వంట బాగులేదని నానామాటలూ అనేవారు.

అప్పుకు ఆరోజు విపరీతమైన చలిజ్వరం వచ్చింది. ఈమధ్య ఆమెకు అడపాదడపా సుస్తీ చేస్తూనే ఉంది. ఇంట్లో ఒకమూల దుప్పటి కప్పుకుని పడుకుంది. ఆరోజు వంట చేసుకోవడానికి సరళ ఎంత బాధపడిపోయిందో, భర్తతో చెప్తూ, తెగ విసుక్కుంది. ఆమెను దగ్గరకు వచ్చి పలకరించనైనా పలకరించలేదు—కృష్ణ

ఆమెచేత సకల చాకిరీ చేయించుకున్న ఆమె మనవలలో ఒక్కరు కూడా, వచ్చి మంచినీళ్లయినా ఆమె కివ్వలేదు. సాయంకాలమైనా ఆమె పడుకునే ఉండేసరికే సరళకు కోపం వచ్చింది. ఇహ అప్పటికి తనే వండాలన్నమాట.

కరెంటు లేకపోవడంవల్ల ఇల్లంతా చీకటిగా ఉంది. వంటయింట్లో ఎంతసేపు వెతికినా అగ్గిపెట్టె కన్పించలేదు. కుర్రవాన్నొకణ్ని అగ్గిపెట్టెకోసం పంపి, తను గదంతా తడుముతోంది. మనస్సులోని అక్కసంతా బయటికి వచ్చేసింది. ఆ సమయంలో, "ఈవిడ డొక్కర్తీ మా నెత్తిమీదకి, మాటాడితే మూలుగుతూ పడకేస్తుంది. ఎంతో పెద్ద అభిమాన మున్నదానిలా మమ్మల్ని వదలదు. 'నీ కొడుకింటికి పోవమ్మా' అంటే, ఇక్కడే తిష్ట వేసింది. ఆయన అంతకన్నాను. ఈవిడేదో మనకి చేసేసినట్లు మాట్లాడుతారు. ఇన్నాళ్లూ ఈవిణ్ని తిండి పెట్టి పోషించాము; ఇహ చాలు! ఇంతతో ఈ పీడ విరగడైతే బావుణ్ను. ఏం? ఆ కొడుకు వచ్చి తీసికెళ్లకూడదూ? ఇంకా మమ్మల్నే ఏడిపించాలా? ఈ రోజుల్లో ఒక మనిషికి తిండి పెట్టడం ఎంత కష్టం!" అని సరళ అంటూంటే హఠాత్తుగా లైట్లు వెలిగాయి.

వెంటనే ఆమెకు కన్పించిన దృశ్యంతో ఆమె నిశ్చేష్టురాలయింది. సత్యవతమ్మ మంచం దగ్గర, కూచుని ఆమె తల రాస్తున్నాడు రంగడు. చీకటిలో అతని రాక గమనించలేదా? తనన్న మాటలన్నీ వినబడలేదా? ఏం చెయ్యాలో తెలియక, కొద్ది సెకనులు అలా నిలబడి, తరువాత గబగబా మేడమీదకి వెళ్లి, కృష్ణమూర్తితో, రంగడు వచ్చాడని చెప్పింది.

కృష్ణమూర్తి మేడ దిగి వచ్చాడు. రంగణ్ని చూసి "ఎప్పుడొచ్చావ్?" అని అడిగాడు. దానికి సమాధానంగా రంగడు "ఇప్పుడే." అన్నాడు, అతనివైపు ఉదాసీనంగా చూస్తూ. ఇద్దరి చూపులూ ఒకసారి కలిశాయి.

కొద్ది సెకనులు కళ్లు కళ్లతో సంభాషించాయి. రంగడు, మునుపెప్పుడూ కృష్ణమూర్తి ఎదుట నిల్చి మాట్లాడేవాడు కాడు. కృష్ణమూర్తి వస్తూంటే తప్పుకునేవాడు. ఆ రోజులు వేరు. అప్పుడు కృష్ణమూర్తి పెద్దమనిషి, రంగడు రవుడీ, కృష్ణమూర్తి బుద్ధిమంతుడు, రంగడు పోకిరి. ఇప్పుడు ఇద్దరి స్థితులూ మారాయి. రంగడు కూడా పెద్దమనిషే. రంగడి లోపాలు అందరికీ తెలుసు. ఇప్పుడు కృష్ణమూర్తి తత్వం కూడా అందరికీ తెలిసింది. ప్రక్క యింటి రత్తమ్మ, తన కోడలిచేత రంగడి పెళ్లానికి ఉత్తరం రాయించింది. అందులో యిక్కడ సత్యవతమ్మ పడుతున్న అగచాట్లన్నీ వర్ణించింది. తొందరగా వచ్చి రంగడు తీసుకువెళ్తే ఆఖరి క్షణాల్లోనైనా సత్యవతమ్మ సుఖశాంతులు పొందుతుందని తెల్పింది.

అది చదివిన వెంటనే రంగడు బయల్దేరి వచ్చాడు.



# అనుబంధం

'కృతఘ్నుడా ! ఇదా నీ అన్నదాతకు నువ్వు చేసే ప్రత్యుపకారం ?' అన్నట్లు రంగడి చూపులకు తట్టుకోలేక తన మొహం ప్రక్కకి తిప్పుకున్నాడు కృష్ణమూర్తి. తప్పుచేసినవాడి మనస్తత్వం ప్రతిఫలిస్తున్న కృష్ణమూర్తి మొహం చూస్తూ "అమ్మని తీసుకువెళ్దామని వచ్చా" నన్నాడు, రంగడు. సన్నగా, ఎర్రగా, గాలితో తేలిపోతున్నట్లుండే రంగడు ఇప్పుడు బాగా లావయ్యాడు. కొద్దిగా పొట్ట వచ్చింది. అతని చిన్న కళ్లు మునుపు బిలిపిగా పక్క చూపులు చూస్తుండేవి. ఇప్పు డవి తీక్షణంగా ఎదుటివారిని పరిశీలిస్తున్నాయి. పంచె కట్టుకుని, లాల్చీ వేసుకుని, దానిమీద సిల్కు కండువా వేసుకున్న రంగణ్ణి చూస్తుంటే, తన తప్పులమీద తీర్పివ్వ బోతున్న జడ్జిలా కన్పించాడు కృష్ణమూర్తికి. "సరే" నన్నాడు.

వెంటనే రిక్షా పిలిపించి, రంగడు ఆమెను అందులో కూర్చోపెట్టి స్టేషనుకు తీసుకు వెళ్లాడు. శని పీడ విరగడైందని సరళా, ఆమె పిల్లలూ సంతోషించారు. కృష్ణమూర్తి మౌనంగా ఊరుకున్నాడు.

తల్లిని తన యింటికి తీసుకువచ్చి డాక్టరు చేత మందిప్పించి తనూ, ఇందిరా పరిచర్య చేసి ఎలాగైతేనేం వారంరోజుల్లో ఆమెకు స్వస్థత కలిగేటట్లు చేశారు. సత్యవతమ్మ మెల్లిగా కోలుకుంది. ఇందిర ఆమెను కంటికి రెప్పలా చూసుకుంటోంది. మనిషి బాగా శుష్కించి నీరసించిపోవడంవల్ల ఏ పనీ చెయ్యలేకపోయేది. కోడలు తనకు అన్ని విధాలా సేవచేస్తూంటే, ఆమె ఎంతో ఆనందించింది. ఇందిర కూడా అత్తగారికి, కృష్ణమూర్తి చేసిన అన్యాయానికి వాళ్లను నిందిస్తూ, తన శాయశక్తులా ఉపచర్యచేసింది. వాళ్ళు సత్యవతమ్మను పెట్టిన హింసలూ, వాళ్ల కృతఘ్నతా, స్వార్థపరత్వం అన్నీ తమకు తెలిసాయని రంగడూ, ఇందిరా అంటూంటే సత్యవతమ్మ విని ఊరుకునేది.

ఒక్కొక్కప్పుడు భర్తతో ఇందిర అనేది, "మీకు ఇంత అన్యాయం చేసిన తల్లిని మీరు కాబట్టి ఆఖరి దశలో ఆదరిస్తున్నారుగాని మరొకరెవరూ ఆదరించరు". దానికి జవాబుగా రంగడు, "అన్నయ్యకే బాగా సుఖం మప్పి అన్యాయం చేసిందను కుందాం. నేను కష్టాలలో పెరగడంవల్లనే జీవితాన్ని అర్థం చేసుకుంటున్నాను. ఒకవిధంగా ఆవిడ నా కుపకారమే చేసిందనుకో" అనే వాడు. ఇందిర వెటకారంగా నవ్వేది.

దత్తపుత్రుడి అభిమానానికీ, కోడలి మంచిబుద్ధికీ సత్యవతమ్మ ఎంతో సంతోషించింది. సరళకు, ఇందిరలో మంచితనం లేశమైనా లేదంటూండేది. ఇప్పటికైనా తనకు చేసిన అన్యాయానికి ఆమె పశ్చాత్తాపపడుతూంటుందని ఇందిర అనుకునేది.

మరొక రెండు నెలలు గడిచాక మళ్ళీ సత్యవతమ్మకు హఠాత్తుగా జబ్బు చేసింది. విపరీతమైన జ్వరం, పలవరింతలతో ప్రారంభమైంది. ఒక పూటంతా పరీక్షచేసి, మందిచ్చాక, ఆమెకు ఆరోజు గడవదని డాక్టరు చెప్పాడు. గంటలలో ఉందని, ఆప్తులందరికీ తెలియబర్చమని చెప్పాడు. ముఖ్యంగా ఆ ఉదయంనుంచి ఆమె "కృష్ణా" "కృష్ణా" అని పలవరిస్తోంది. కాబట్టి ఆయనను పిలిపించమన్నాడు.

రంగడు కృష్ణమూర్తికి టెలిగ్రాం ఇచ్చాడు.

సాయంకాలం దగ్గర్నుంచి ఎగశ్వాస ప్రారంభమైంది. మూసిన కన్ను, అప్పుడప్పుడు తెరచి, ఎవరికోసమో చూస్తూండేది. చుట్టూవున్న రంగణ్ణి, ఇందిరనూ ఇతర బంధువులనూ, స్నేహితులనూ కాక, ఎక్కడో శూన్యంలోకి చూస్తూండేది. శ్రీకాకుళం వైపునుండి వచ్చే రైళ్లన్నీ వెళ్లిపోయాయి. రాత్రి తొమ్మిదయింది. ఒక్కసారి కళ్లు తెరిచింది. రంగడివైపుచూసింది. అతను దగ్గరకు వచ్చాడు. మెల్లిగా, హీన స్వరంతో, "కృష్ణ...డు...రా...లే...దా?" అని అడిగింది. రంగడు తలవూపాడు. అదే సమయంలో "పెద్దమ్మా!" అని కేకేస్తూ, కృష్ణమూర్తివచ్చి ఆమె చేతుల్లోవాలాడు. ఆమె ప్రాణం అనంత వాయువుల్లో కలిసిపోయింది. కృష్ణమూర్తి గుండెలు బాదుకుని ఏడుస్తూంటే, రంగడు నిశ్చేష్టుడై శూన్యంలోకి చూడసాగాడు. ●

# మీ జుత్తును ఆరోగ్యంగా నిగనిగలాడేలాగు వుంచుతుంది

# బ్రిల్‌క్రీమ్

సర్వోత్తమ హేర్-డ్రెస్సింగ్

కేవలం బ్రిల్‌క్రీమ్ మాత్రమే

- చక్కగా జుత్తు దువ్వుకొనడానికి సాయపడుతుంది. జుత్తు జిడ్డు కాదు. చెదరి పోదు.
- చాలా పొదుపు అయినది; ఒక్కసారి రాస్తే చాలు రోజంతా జుత్తు రేగదు.
- దీనిలో చేర్చిన అద్వితీయమైన మిశ్రమము మాడును పోషించి, జుత్తును బాగా పెంచుతుంది.
- మీ జుత్తు యొక్క సహజ రంగును బయలు పరచును.




**మీరు కూడా బ్రిల్‌క్రీమ్ ఉపయోగించడం మొదలు పెట్టండి**

ప్రపంచమంతటా లక్షలాది మంది సొగసుకారులు ఉపయోగించేది.




సూర్యుడు, చంద్రుడూ, నక్షత్రాలూ, గ్రహాలూ, ఉల్కాలూ, తోకచుక్కలూ దీప్తివంతమైనవి. వైజ్ఞానికులు వీటి గమనాన్ని, దూరాల్ని పరిశీలించి పరిశోధించారు. జనము వీటిని గురించి తెలుసుకుని వినోదించారు. అయితే, వైజ్ఞానికుల పరిశీలన ప్రధానమైన వాటినే చూచి వదిలేయదు. ఆకాశంలో అక్కడక్కడ నక్షత్రపు దూదిపింజల్లాగ, చిన్న చిన్న తెల్ల మచ్చల్లాగ కనవడేవి నెబ్యులాలు అన్నవి ఉన్నాయి. వట్టి కంటికి కనవడేవి అక్కడ ఒకటీ ఇక్కడ ఒకటి ఉంటాయి గాని టెలిస్కోపుతో చూస్తే ఇవి చాలా కనవడతాయి. 1782 నాటికి ఫ్రెంచి జ్యోతిశ్శాస్త్రజ్ఞుడు ఛార్లెసు మెస్సియరు నూటికి మించిన నెబ్యులాల్ని గుర్తించి పట్టిక వేశాడు. నక్షత్రాల దూరాలు కనుక్కోడనికష్టమై పోతూంటే వీటి దూరాల్ని కనుక్కోడానికి ఎవరు తంటాలు పడతారూ? హెర్షల్ వీటిని నక్షత్రపు గుంపులన్నాడు. నక్షత్రపు గుంపుల. వెలుతుర్ని వర్ణపటదర్శని (Spectroscope) తో చూస్తే VIBGYOR రంగులు చారలాగ కనబడతాయా, నియోను దీపాల కాంతిని చూస్తే గీతలు గీతలుగా కనబడతాయి. నెబ్యులాలు కొన్ని చారల్ని చూపెయ్యా, కొన్ని ఆవిరి (Vapour) దీపాలలాగ గీట్లు చూపించాయి. 1867లో నెబ్యులాల నుంచి వచ్చే కాస్త కాంతినీ వర్ణపట దర్శనిలో చూచి సర్ విలియం హగ్గిన్స్ ఒక్క కాంతివంతమైన గీతను గుర్తించి విస్తుపోయాడు. కొన్ని నెబ్యులాలు నక్షత్రాల గుంపులు కాగా కొన్ని జ్వలిస్తూన్న వాయువులైనాయి. ఇవి ఎంత దూరాన్న ఉన్నాయీ అన్నది జవాబులేని ప్రశ్న అయిపోయింది.

1912లో హెన్రీటా లీవిట్ అన్నామె నక్షత్రాల ఫోటోగ్రాపులు—ఒకే ఆకాశ భాగానివీ వేర్వేరు కాలాల్లో తీసినవీ—పరిశీలిస్తూ, అవి కాంతిలో తగ్గి, పెరిగి, తగ్గి, చేస్తున్నాయనీ, ఈ ఆవృత కాలము కాంతి గల నక్షత్రాలకు ఎక్కువా, తక్కువ కాంతి గల వాటికి తక్కువా అని కనిపెట్టింది. రెండు నక్షత్రాలకు గాని ఈ ఈ కాంతి ఆవృతకాలము ఒక్కటే అయితే, వాటి కాంతిమత్వాన్ని బట్టి దగ్గర నక్షత్రానికి దూరానిది ఎన్నిరెట్లు దూరంలో ఉన్నదో లెక్కవేయవచ్చును. ఈ రకపు నక్షత్రాల్ని సెఫియడ్ నక్షత్రాలన్నారు. ఇలాటివి నెబ్యులాలలో కూడా కనబడ్డాయి. పాలపుంత అన్న నక్షత్రాల చార మన సూర్యుడు ఉన్న ఒక పెద్ద నక్షత్రాల జగత్తు. మన కంటికి కనవడేవి, టెలిస్కోపుకి కనబడేవీ నక్షత్రాలన్నీ ఈ పాలపుంత అనే నక్షత్ర జగత్తులోవే. దీనిలో కూడా సెఫియడ్ నక్షత్రా లున్నాయి. నెబ్యులాలలోనూ ఉన్నాయి. మన పాలపుంతలోని ఒక సెఫీయడుతో, నెబ్యులాలలోని సెఫీయడు కాంతి ఆవృతకాలమూతో సమాన మనుకోండి. అప్పుడు వీటి కాంతి మత్వాన్ని పోల్చి, నెబ్యులాలోని సెఫీయడు మన జగత్తులోని సెఫీయడు దూరానికి ఎన్నిరెట్లు దూరంలో ఉన్నదో లెక్కవేయవచ్చును. ఇలా లెక్కవేసే ఎడ్విన్ పి. హాబుల్, మెస్సియర్—31 అన్న నెబ్యులా 900 000 కాంతి సంవత్సరాల దూరము ఉన్నదన్నాడు.(కాంతి సెకనుకు 1,86,000 మైళ్ల చొప్పున ప్రయాణిస్తూ ఒక ఏడాదికి ప్రయాణించగల దూరము ఒక కాంతి వత్సరము.

హాబుల్ ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయములో న్యాయశాస్త్రము చదివి అమెరికా తిరిగి వెళ్లి, ప్రాక్టీసు పెట్టి హఠాత్తుగా యార్కిస్ నక్షత్ర వేధశాలలో పరిశోధన ప్రారంభించాడు. "హీనకాంతి గల నెబ్యులాల ఫోటోల పరిశీలన" అన్నది ఆతడు డాక్టరేటు పట్టము కోసము చేసిన పరిశోధన. దీనిని పెంచి నెబ్యులాల దూరాలూ, వాటి కాంతి విశ్లేషమునుబట్టి వాటిలోనీ—, వాటియొక్కా—, గమనములూ పరిశీలించాడు హాబుల్. దీపావళి చక్ర టపాకాయలవలె కనబడే స్పైరల్ నెబ్యులాలు తమ చుట్టూ తాము తిరుగుతున్నట్టు తెలిసింది. నెబ్యులాల కాంతి యొక్క వర్ణ పటము (Spectrum) లో ఒకే ఆకుపచ్చని రేఖను హగ్గిన్స్ లనే శాస్త్రజ్ఞుడు చూచాడని ఇంతకుముందు అనుకున్నాము. ఈ రేఖ నెబ్యులాల వర్ణపటాలలో క్రమంగా ఎరుపువైపు జరగడము కనబడింది హాబుల్‌కి. అసలే నెబ్యులాల కాంతి అతి హీనము. ఎన్నో నక్షత్రాల నడుమను ఉన్న 'మచ్చ' వెలుతురును వర్ణపటము తీసే స్పెక్ట్రోస్కోపు

గొట్టాము ముఖమందున్న పీరికమీద పడుతుండేటట్టు ఏర్పాటు చెయ్యాలి, ఒక రాత్రి కాదు, పది రాత్రులు చెయ్యాలి, పకాలానికి మూసి తెరుస్తూ, భూమి తిరుగుడుతో ఆ వెల్తురు తప్పి పడకుండా వేసుకోవాలి. ఇలాగ ఎన్ని నెబ్యులాలకో చెయ్యాలి. అన్నిటికీ కూడా వర్ణపట రేఖల "ఎరుపు జరుగుడు" సిద్ధమే అయింది.

మనము స్టేషనులో ఉన్నప్పుడు కూత కూస్తూ రైలు మనల్ని జోరుగా దాటుతోందనుకోండి. రైలు మనవైపు వస్తూన్నకొద్దీ దాని కూత కీచుదనము స్థాయి హెచ్చుతుందీ, అది మనల్ని దాటిపోయి దూరమై పోయినకొద్దీ కూత స్థాయి తగ్గుతుంది. కాంతిలో నీలముది ఎక్కువ స్థాయీ, ఎరుపుది తక్కువ స్థాయీని. నెబ్యులా కాంతిరేఖలు ఎరుపువైపు మొగ్గినవంటే, ఆ నెబ్యులాలు మనకు దూరమై పోతున్నాయన్నమాట. నెబ్యులాలు అన్నీ మననుంచి దూరముగా పరుగెత్తి పోతున్నాయన్నమాట.

అయితే అవన్నీ భూమినుంచే ఎందుకు పారిపోవాలి ? కారణము లేదుకదా ? భూమినుంచి కాదు అవి పారిపోతూంట. అవి ఒకదాని నుంచి ఇంకొకటి దూరమవుతున్నాయి. అంటే, నెబ్యులా లన్నిటితోనూ చేరివున్న యీ విశ్వము వ్యాకోచిస్తున్న దన్నమాట. చిన్న ఉండగా చేసి ఉడికించిన రొట్టె ఉబ్బితే, దానిలోని ద్రాక్షపండ్లు పరస్పరము దూరముకావూ! ఆలాగే నెబ్యులాలు—వ్యాకోచమాన విశ్వములో—దూరమవుతున్నాయి.

ఇక్కడితో సొగసు అయిపోలేదు. నెబ్యులా దూరమవుతూన్న కొద్దీ వాటి వేగము కూడా ఎక్కువవుతూన్నది! దగ్గర వాటికంటే దూరానివి ఎక్కువ వేగంతో పారిపోతున్నాయి. వెళ్ళగా వెళ్ళగా ఒక నెబ్యులా వేగము వెల్తురు వేగము (సెకనుకు 1,86,000 మైళ్ళు) కంటె ఎక్కువైపోయిం దనుకుందాము. ఐన్‌స్టీన్‌ను సాపేక్షతావాదము ప్రకారము ఏ వస్తువూ వెల్తురు వేగాన్ని అందుకోలేదు. అందుకుంటే, అది ఏమవుతుందోవూహించలేము. ఇది ఒక దారి. ఒక వస్తువు వెలుతురు వేగంతో మనకు దూరంగా పోతూంటే దానినుంచి మనకు చేరే వెలుతురు వెల్తురుగా ఉండదు. అంటే అది మనకు మరి కానరాదు. టెలిస్కోపులకూ అందదు అది.

కంటికి కానరాని నక్షత్రపు మచ్చను వెంటాడితే బయల్పడ్డ సత్యము, మన విశ్వ పరిమితి. అది మన దగ్గర నుంచి, నెబ్యులాలు సెకనుకు 1,86,000 మైళ్ళ వేగం అందుకున్న ఆ....హా దూరము వరకూను !









# బ్రహ్మముడి

**న్యాయపతి రాజగోపాలం**

(గత సంచిక తరువాయి)

రాత్రి పన్నెండు గంట లయింది. అసలే చీకటిరాత్రులు. అందులో మేఘాలు దట్టముగా అలముకొని ఉన్నాయి. బ్రహ్మాండమైన చీకటిగా ఉన్నది. రాజేశ్వరరావు రామయ్యగారి పెరటి గుమ్మం వద్ద చేరాడు. అప్పటికే గోపన్న బండి సిద్ధంగా ఉన్నది. స్వర్ణ వస్తుందో, లేక తన ప్రయత్నమంతా వ్యర్థమవుతుందో అని ఎంతో ఆతృతతో రాజేశ్వరరావు ఎదురుచూస్తున్నాడు. అయిదు నిమిషాలు గడిచాయి. కాని అతడికి ఒక గంట గడిచినట్లయింది. అప్పుడే ఒకవైపు నుండి నిరాశ అతడిని ఆవరిస్తోంది. ఇంతట్లో లోపలినుండి గడియ తీస్తున్న శబ్దం వినిపించింది. ఆ తరువాత తలుపు తెరుచుకున్న శబ్దం, దానితో గుమ్మని పూర్ణవాసన. ఉత్తర క్షణంలో అతడి ఛాతికి ఏదో గట్టిగా తగిలింది. రాజేశ్వరరావు తుళ్ళిపడ్డాడు. కాని, అది సూటుకేసు అని, దానిని ఆమె తనకి అందిస్తోం దని గ్రహించాడు. వెంటనే ఆమె చేతిలో నుండి దానిని తీసుకొన్నాడు. వెళ్ళి బండిలో పెట్టాడు. ఆమె కూడా అతడి వెనక వచ్చింది.

జయం మనదే అని ఒక్కసారి గట్టిగా కేకవెయ్యా లనిపించింది రాజేశ్వరానికి. ఆమెను తన బాహువుల్లోకి తీసుకోవాలని ఎంతో ఉబలాట పడ్డాడు. కాని ఇది చాలా ప్రమాదకరమైన సమయం. పైగా టైము అయిపోతోంది.

ఆమె బండిలో కూర్చొన్నది. రాజేశ్వరరావు గోపన్న వద్దకు వెళ్ళి "గోపన్నా, నేను బండి వెంట రావడం అంత క్షేమంకాదు. అడ్డదారిని వచ్చి స్టేషనుకు ముందుగా కలుసుకొంటాము." అని అతడి చెవిలో చెప్పాడు.

బండి కదిలింది. రాజేశ్వరరావు అడ్డదారి పట్టేడు.

స్టేషను ఇంకొక ఫర్లాంగు ఉన్నదనగా ఈ అడ్డదారి రోడ్డుకి కలుస్తుంది. అతడు అక్కడివరకు త్వరగా వెళ్ళాడు. గోపన్న బండి వచ్చేవరకు అక్కడ నిలబడ్డాడు. అక్కడినుండి బండివెంట నడక ప్రారంభించాడు.

ఇంతలో దూరం నుండి రైలు చప్పుడు వినిపించింది. అప్పుడే ప్యాసెంజరు వచ్చేసిందే అని అతడు ఖంగారు పడ్డాడు. కాని, స్టేషను దగ్గర పడినా ఆ రైలు వేగం తగ్గలేదు. పైగా ప్లాటుఫారం రెండవ చివర అతడికి ఆకుపచ్చ దీపాలు కనిపిస్తున్నాయి. ఓహో, ఇది ఎక్స్‌ప్రెస్ అయివుంటుం దనుకొన్నాడు.

స్టేషను ఇంకో వంద గజాలు ఉన్నదనగా రోడ్డు ఒక మలుపు తిరిగి పట్టా

పక్కా నుండి వెళ్తుంది. గోపన్న బండి మలుపు తిరిగేసరికి ఎక్స్‌ప్రెస్ ముఖం మీది సెర్చిలైట్ బండిలో పడి లోపలి అంధకారాన్ని ఒక్కసారి తరిమివేసింది. రాజేశ్వరరావు బండిలోకి చూశాడు.

బండిలో స్వర్ణ లేదు. జగదాంబ కూర్చొని ఉన్నది.

రాజేశ్వరరావు అదిరిపడ్డాడు. "ఈ పిశాచము ప్రవేశించిం దేమిటి ?" అనుకొన్నాడు. అతణ్ని ఒక్కసారిగా నిరుత్సాహం, కోపం ముంచెత్తివేశాయి.

కాని అతడు ఏమాత్రం బయటపడలేదు. మనస్సుని నిగ్రహించుకొన్నాడు. ఇక మీదట జరగబోయే సంభాషణ మూడో వ్యక్తి ఎవరూ వినకూడదని అతడికి స్ఫురించింది. వెంటనే "గోపన్నా, ఎక్స్‌ప్రెస్ ఇంకా ఇప్పుడు వెళ్తోంది. మన ప్యాసింజరు బాగా లేటు అయ్యేటట్లు ఉన్నది. నీ బండి ఇక్కడ నిలబెట్టి ఒక్కసారి స్టేషనుకి వెళ్లిరా. ఎంత లేటో కనుక్కో. ఇదిగో పది పైసలు. ఆచేత్తో కాస్త టీ కూడా తాగు," అని గోపన్నని పంపివేశాడు. గోపన్న కాస్త దూరం కాగానే,

"వారు రాలేదా" అని జగదాంబ ప్రశ్నించింది.

"వా రెవరు ? ఎవరు వారు ?" అన్నాడు రాజేశ్వరరావు ఒళ్లు మండిపోతూ.

"సుబ్బరాజుగారు."

"సుబ్బరాజుగారు వస్తామన్నారా ?"

"అవును. గోపన్న బండి తీసుకొని వస్తా మని కూడా వ్రాశారు."

"అంటే ? ఉత్తరం వ్రాశారా ?"

"అవును."

"హోహో, రాత్రి పెరటి ద్వారం తెరుచుకొని మిమ్మల్ని రమ్మని, ఒంటి గంట ప్యాసింజరుకి ప్రయాణమని, ఏ కారణం వల్ల మీరు రాలేకపోయినా వారి శేష జీవితం చీకటి అవుతుందని కూడా వ్రాశారా ?"

"అవును. అన్నీ తెలిపి కూడా వారు రాలేదా అంటే ఎవరు రావాలి అని అడుగు తావేం ?" అన్నది జగదాంబ కోపంగా.

రాజేశ్వరరావు రోడ్డుమీద కూలబడ్డాడు. "రండి, బండి దిగండి. కొంప మునిగింది" అన్నాడు.

జగదాంబ బండి దిగి వచ్చింది.

"కూర్చోండి" అన్నాడు రాజేశ్వరరావు. జగదాంబ కూడా రోడ్డుమీద చతికిల పడ్డది.

"ఆ ఉత్తరం నేను వ్రాశాను" అన్నాడు.

"ఏమిటీ ? నువ్వు మనిషివా పశువ్వా ? నీ వయస్సేమిటి, నా వయస్సేమిటి ? నువ్వు నాకు అలా వ్రాయనచ్చా ? నామీద నీకు కోపం ఉన్నమాట నిజమే. కాని నా పరువు తీసి నన్ను నడివీధిలో నిలబెట్టడానికే పూనుకొన్నావా ? నీకు తల్లి లేదా, అక్కచెల్లెళ్లు లేరా ?" అన్నది జగదాంబ గొంతెత్తి.

"ష్. గోల చేయకండి. నేను కలలో కూడామీకు అటువంటి ఉత్తరం వ్రాస్తానా? దానిని నేను స్వర్ణకి వ్రాశాను" అన్నాడు రాజేశ్వరం.

"స్వర్ణకా ? ఓహో, అదా నీ ప్రయత్నము అయితే దానిమీద రాజు అని ఎందుకు సంతకం చేశావ్ ?"

"నాపేరు అదే."

"పోనీ అలాగే అనుకో. ఆ ఉత్తరాన్ని ఈ గదిలోకి ఎందుకు విసిరావ్ ?"

"మీ గదిలో ఎలా పడుతుంది? తోట లోంచి మేడమీది ఎడంచేతివైపు కిటికీ లోకి విసిరాను."

"అదే నా గది అని చెప్తున్నాను."

రాజేశ్వరరావుకి అంతా అయోమయంగా ఉన్నది. "ఈమధ్య మీరు స్వర్ణ గదులు మార్చుకొన్నారా?" అని అడిగాడు.

"లేదు."

ఇది ఎలా తటస్థపడ్డదా అని రాజేశ్వరరావు తీవ్రంగా ఆలోచించాడు. కొంతకాలం ఆలోచిస్తే జరిగిన పొరపాటు అతడు గుర్తించగలిగాడు. ఇదివరకు తను రామయ్యగారి ఇల్లు చూసినప్పుడు నాలుగిళ్ల వాకిట్లోంచి మెట్లెక్కి మేడమీదకి వెళ్లాడని అప్పుడు ఎడంచేతివైపు గది చూపించి ఇది స్వర్ణ గది అని హేమ చెప్పింది. కానీ ఇప్పుడు తను తోటలో నుండి ఉత్తరం విసరాడు. అంటే ఇదివరకు తను గది చూసిన వైపుకి అభిముఖంగా నిలబడ్డాడు. అంటే కుడిచేతివైపు కిటికీ స్వర్ణ గది అవుతుంది. ఎంత పొరపాటు జరిగింది!

"అవును. నా కిప్పుడు అంతా అర్థమయింది. నా పొరపాటు ఏమిటంటే—" అని జగదాంబకి అంతా చెప్పాడు రాజేశ్వరరావు.

దూరాన్నుండి ఒక గూడ్సు మందగమనంతో గజగజలాడుతూ వస్తున్నది. దాని దీపపు కాంతి వా రిద్దరిపైన మసకగా పడుతోంది.

"అయితే నే నిప్పుడు ఏం చెయ్యడం? నేను తిరిగి మా అన్నయ్యగారింటికి వెళ్లలేను. నేను వచ్చేటప్పుడు మా అన్నయ్య పేర ఒక ఉత్తరం కూడా వ్రాసిపెట్టి వచ్చాను. వాళ్లెవరైనా లేస్తే ఈపాటికి దాన్ని చూచే ఉంటారు. ఇక నాకు గత్యంతరం లేదు. ఆ వస్తున్న రైలుక్రింద పడి ఇంతటితో ఈ జీవితంనుండి విముక్తి పొందుతాను" అని ఏడుస్తూ జగదాంబ పట్టాలవైపు వెళ్తోంది.

రాజేశ్వరరావు హడలిపోయాడు. 'ఆగండి' అని గట్టిగా ఒక కేక వేశాడు—ఆమె నిలబడ్డది—"దీనికి ఏదో ఉపాయం మనకు తప్పకుండా దొరుకుతుంది. మీరు ఆవేశపడకుండా కూర్చోండి. నేను ఆలోచిస్తాను" అన్నాడు.

జగదాంబ తిరిగి వచ్చి కూర్చొంది. రాజేశ్వరరావు మౌనంగా కొన్ని నిముషాలు ఆలోచించాడు.

"సుబ్బరాజుకి మీమీద నిజంగానే అనురాగం ఉన్నదా ?" అని ప్రశ్నించాడు చివరికి.

"ఉన్నదనే అనుకొంటున్నాను. లేకపోతే ఆయన ఉత్తరం వ్రాస్తారని నేను ఎలా భావిస్తాను?" అన్నది జగదాంబ కళ్లు తుడుచుకొంటూ.

"అయితే పదండి ఆయన వద్దకు మిమ్మల్ని తీసుకు వెళ్తాను" అన్నాడు రాజేశ్వరరావు.

"ఛీ, ఛీ. నేను ఆడదాన్ని. ఆయన వద్దకు వెళ్లి ఏమని చెప్పుకోను?" అన్నది జగదాంబ

"అవన్నీ నేను చూసుకొంటాను. ఇందులో మీకు ఏవిధమైన అపకీర్తి రానివ్వను

అపూర్వ సోది. ఏమీ దిగులుపడకండి. మీరు మాత్రం ఆ గాజులు, ఆ పువ్వులు తీసేసి తల కాస్త చింపిరి చేసుకోండి. గోపన్న వస్తున్నట్టుంది. వెంటనే బండి ఎక్కండి" అన్నాడు రాజేశ్వర్రావు.

జగదాంబకి కాస్త ధైర్యం వచ్చింది. అతడు చెప్పినట్లు చేసి తిరిగి బండిలో కూర్చొన్నది.

"తమరు వెళ్లే రైలు మూడు గంటలు లేటంట" అని వచ్చి చెప్పాడు గోపన్న.

"మూడు గంటలే ! అయితే లాభంలేదు. తిరిగి మమ్మల్ని నా బస వద్దకు చేర్చు" అన్నాడు రాజేశ్వర్రావు.

బండి తిరుగుమోహం పట్టింది. సుబ్బరాజు ఇంటికి కాస్త దూరంగా ఆపించాడు రాజేశ్వర్రావు. తను ఒక్కడూ వెళ్లి సుబ్బరాజు తలుపు తట్టాడు.

సుబ్బరాజు తలుపు తీశాడు. రాజేశ్వర్రావు లోనికి వెళ్లి కూర్చొన్నాడు.

"ఇంకా మీరు పడుకోలేదా? ఇంత రాత్రి వరకు ఏమి చేస్తున్నారు ?" అని సుబ్బరాజు ప్రశ్నించాడు.

"ఇది ప్రత్యేకంగా భగవంతుడు నా కోసం ఏర్పరచిన రాత్రి. నే నెలా పడుకోగలను? ఒక ముఖ్యమయిన విషయం గురించి మీతో మాట్లాడడానికి వచ్చాను. నేను అడిగే ప్రశ్నకి సూటిగా జవాబు చెప్పండి. మీరు జగదాంబను నిజంగా ప్రేమిస్తున్నారా?" అని రాజేశ్వర్రావు అడిగాడు.

సుబ్బరాజు ముఖం కందగడ్డలా చేసుకొన్నాడు. "ఈమధ్య మన ఇద్దరికీ కొంత చనువు ఏర్పడిన మాట నిజమే. కాని ఇటువంటి ప్రశ్న మీరు వెయ్యడం చాలా తప్పు" అన్నాడు కోపంగా.

"అది నిజమే ననుకోండి. కాని ఒక వ్యక్తి చావు బ్రతుకులు మీ సమాధానం పైన ఆధారపడి ఉన్నవి. నేను చెప్పేది పూర్తిగా వింటే మీకే తెలుస్తుంది." అన్నాడు రాజేశ్వర్రావు.

"వింటున్నాను" అన్నాడు సుబ్బరాజు ముక్తసరిగా.

"భోజనం ముగించి ఏమీ తోచక అలా తిరిగి వద్దామని వెళ్లాను. చెరువు సమీపించే సరికి ఎవరో వ్యక్తి ఆత్మహత్యకి ఉపక్రమిస్తున్నటు నాకు కనిపించింది. వెంటనే ఆమెను వారించాను. ఆమె ఎవరనుకున్నారు? జగదాంబ" అన్నాడు రాజేశ్వర్రావు.

"ఏమిటీ? జగదాంబే ?" అన్నాడు సుబ్బరాజు అదిరిపడి.

"అవును. ఆ తరువాత ఆమెను బుజ్జగించి ఎందు కింత ఘోరమైన పనికి తల పెట్టిందో అడిగాను. చివరికి ఆమె నాతో యదార్థమంతా చెప్పింది. ఏనాటినుండో ఆమె మనస్సు మీపైన లగ్నమయిందనీ కాని, మిమ్మల్ని పొందే అవకాశం ఆమెకు ఇక లేదని నిరాశతో ఆపని చేస్తున్నట్లు చెప్పింది. ఆమెకు ధైర్యం చెప్పాను. ఆమెను స్వీకరించమని మిమ్మల్ని అభ్యర్థించడానికి ఇప్పుడు మీ వద్దకు వచ్చాను" అన్నాడు రాజేశ్వర్రావు.

"ఎంత ఘోరం! నాకు మాత్రం ఆమె అంటే అభిమానం లేదా? ఒక్కమాట ఆమె ఎప్పుడైనా నాతో అనివుంటే యీపాటికి నేనామెను పువ్వుల్లో పెట్టి పూజించే వాడిని కదా ! అసలు నేనే ఆమెను ఈ విషయము అడగాలని అనుకొన్నాను. ఇవాళ సాయంత్రం ఆమాట నా నోటి చివరివరకు వచ్చింది కూడా. కాని ధైర్యం చాలలేదు. ఆమె ఇప్పుడు ఎక్కడ ఉన్నది? పదండి వెంటనే వెళ్లి తీసుకువద్దాం. మీరు పక్కన నిలబడితే నాకు బాగా ధైర్యం వస్తుంది." అన్నాడు సుబ్బరాజు లేస్తూ.

"ఆమె ఇక్కడే ఉన్నది. మీరు కూర్చోండి. నేను తీసుకొని వస్తాను" అంటూ రాజేశ్వరరావు వెళ్లాడు.

"అంతా జయం అయింది. మీరు ఆత్మహత్య చేసుకొంటున్నట్టు, నేను అడ్డు పడినట్టు సుబ్బరాజుతో చెప్పాను. దానితో అతడు పాత బస్సులాగ గడగడ లాడిపోతున్నాడు. మీకోసం ఎదురు చూస్తున్నాడు" అని జగదాంబతో చెప్పాడు.

జగదాంబ బండి దిగి రాజేశ్వరరావు వెనుక వచ్చింది.

"ఎంత ఘోరం తలపెట్టావు? నీకు ఇది న్యాయమేనా? ఈ ఇల్లు, నాహృదయం నీకోసం ఎప్పుడూ తెరిచే ఉంటాయని నీకు తెలియదా ? సమయానికి మాస్టారిని భగవంతుడు పంపించాడు. లేకపోతే ఏమైనట్టు? లే, లే, నా జగా—నా గదా—నా దంబా—" హడావడిలో ఆమె ముద్దుపేరు మరిచిపోయాడు సుబ్బరాజు.

"శుభం" అన్నాడు రాజేశ్వర్రావు గట్టిగా వూపిరి వదులుస్తూ.

"మేం వెంటనే ఎవరికి తెలియకుండా ఏ అన్నవరమో వెళ్లి దేవాలయంలో వివాహం చేసుకోవాలి. లేకపోతే ఈ వూళ్లో చాలా గొడవ జరుగుతుంది—" గోడ గడియారం వైపు చూశాడు సుబ్బరాజు— "అయ్యో, ఒంటిగంట దాటిపోయింది. లేకపోతే మాకు వెంటనే ప్యాసింజరు దొరికేది" అన్నాడు చేతులు నులుముకొంటూ.

"మీకు ఆ భయం అవసరంలేదు. ఆ ప్యాసింజరు మూడు గంటలు లేటని నాకు తెలిసింది. గోపన్న బండి బయట సిద్ధంగా ఉన్నది. అన్నీ వూహించే పెట్టెలో బట్టలు తెచ్చుకోమని జగదాంబగారితో నేను మొదటే చెప్పాను. ఇక మీ పెట్టె సర్దుకోవడమే ఆలస్యం" అన్నాడు రాజేశ్వర్రావు సుబ్బరాజుతో.

క్షణంలో జగదాంబ సుబ్బరాజు కలిసి పెట్టె, బెడ్డింగు తయారు చేశారు.

"మీరు కూడా మాతో స్టేషనుకి రావాలి మాస్టారు. మీరు సాయంగా ఉంటే నాకు ధైర్యంగా ఉంటుంది." అన్నాడు సుబ్బరాజు.

రాజేశ్వర్రావు గుండెలో రాయి పడింది. కాని కాదనలేకపోయాడు.

"అలాగే వస్తాలెండి. ఈ రాత్రంతా నేను పరోపకారానికే వినియోగించ దలిచాను" అన్నాడు విషాదంగా నవ్వుతూ.

రైలు కదులుతుంటే జగదాంబ అన్నది. "నీ మేలు నేను మరచిపోలేను రాజేశ్వర్రావ్! నువ్వు స్వర్ణని వివాహం చేసుకోవడం నాకు ఇష్టమేనని నేను చెప్పినట్లుగా మా అన్నయ్యతో చెప్పు."

"పోతూ పోతూ బొల్లెద్దు కుడితి" అన్నాడు రాజేశ్వరరావు.

కాని ఆ మాటలు జగదాంబకి వినిపించ లేదు. రైలు చక్రాలు తమ రొదలో తక్కిన శబ్దాలన్నిటిని లీనం చేసుకొన్నాయి.

రాజేశ్వరరావు స్టేషను బయటికి వచ్చాడు.

"గోపన్నా, ఈ రాత్రికి ఇది ఆఖరి ప్రయాణం. ఈ దేహాన్ని ఎలాగో నా బసకి చేర్పించు. ఈ రాత్రికి, ఈ అంధకారానికి అంతమంటూ లేదనుకొన్నాను. కాని అదిగో తూర్పు తెల్లవారుతోంది" అన్నాడు బండి ఎక్కుతూ.

ఉదయం పది గంట లవుతోంది. ఎవరో తలుపు కొట్టిన శబ్దంతో రాజేశ్వరరావుకు తెలివివచ్చింది. లేచి తలుపు తీశాడు. రామయ్యగారి పాలేరు ప్రత్యక్ష మయ్యాడు.

"అమ్మగారు మిమ్మల్ని రమ్మంటున్నారు" అన్నాడు పాలేరు.

అయితే రాత్రి తను వహించిన పాత్ర అప్పుడే రామయ్యగారింట్లో తెలిసిపోయిందన్నమాట. అందుకే రమ్మంటున్నారు. తను వెళ్లాక ఎంత రసాభాస అవుతుందో అనుకొన్నాడు రాజేశ్వరరావు. ఇక తనకి స్వర్ణకి వివాహం జరగడం అన్నది ముమ్మాటికి కల్ల. ఈ జగదాంబ తనకి అన్నివిధాలా అపకారమే చేసింది.

"ముఖం కడుక్కొని స్నానంచేసి వస్తాను నువ్వు వెళ్ళు" అన్నాడు.

"మిమ్మల్ని వెంట వేసుకొని రమ్మన్నారు. మీరు వచ్చేవరకు నేను ఇక్కడే కూర్చుంటాను" అన్నాడు పాలేరు మఠంవేస్తూ.

అతడి వెంట వెళ్లడం రాజేశ్వరరావుకి తప్పింది కాదు. **అడుగు ముందుకు** పడడం లేదు. ఎలాగో రామయ్యగారి ఇల్లు చేరాడు.

"రండి మాస్టారు" అంటూ ఎంతో ఆప్యాయంగా పలకరించింది పార్వతమ్మ. ఈ స్వాగతం అతడిని ఆశ్చర్యపరిచింది.

మండువాలో పీటవేసి అతడిని కూర్చో పెట్టింది. ప్లేటుతో ఏదో ఫలహారం తీసుకు వచ్చి అతడి ఎదుట పెట్టింది.

"నా బ్రతుకే ఒక కాళరాత్రి అనుకొన్నాను మాస్టారు. ఈ అంధకారానికి ఇక అంతం లేదనుకొన్నాను. కాని ఇంతలోనే భళ్ళున తూర్పు తెల్లవారింది" అన్నది పార్వతమ్మ.

రాజేశ్వరరావు గతుక్కుమన్నాడు. ఈ

న్నతో అన్నాడు. అయితే తను ఆడిన మాటలతో సహా జరిగినదంతాగోపన్నవీళ్లకి చెప్పే ఉంటాడు. ఎంత ప్రమాదమయిను పరిస్థితిలో పడ్డాను! అనకొన్నాడు.

పార్వతమ్మ నవ్వింది. "అలా తెల్ల బోతున్నారేం మాస్టారు ! నా మాటలు మీకు అర్థంకాలేదనుకుంటాను. పది సంవత్సరాల నుండి ఈ ఇంటిని ఆవరించిన జగదాంబ పీడ ఈనాటితో వదిలింది. తిరిగి నా ఇంట్లో నాకు స్వతంత్రం లభించింది. సిగ్గులేని మనిషి—అన్నగారి పేర ఒక ఉత్తరం కూడా వ్రాసిపెట్టి వెళ్లింది. రాత్రి మీరు వాళ్లతో స్టేషనుకి వెళ్లినట్లు తెలిసింది" అన్నది.

"నేను స్టేషనుకి వెళ్లానని ఎవరు చెప్పారు?" అన్నాడు రాజేశ్వరరావు.

"జగదాంబ, సుబ్బరాజుతో మీరుకూడా స్టేషనులో కనిపించారని, వాళ్లు రైలు ఎక్కాక సామాన్లు మీరు అందించారని ఎవరో చూచినవారు మావారితో ఈ ఉదయము చెప్పారు" అన్నది.

రాజేశ్వరరావు ఒకసారి గట్టిగా వూపిరి వదిలాడు. అయితే గోపన్న వీళ్లకి ఏమీ చెప్పలేదు. పూర్తి వివరాలు వీళ్లకి తెలియవు. కొంత నయం అనుకొన్నాడు.

ఇంతలో ఎక్కడినుండో రామయ్య గారు వచ్చారు. రాజేశ్వరరావుని చూసి కూడా పలకరించలేదు.

"ఈ ఇంటికి దరిద్రం పట్టుకొన్నది. ఆ పెళ్లికొడుకు ఇవాళ రాడట. అసలు ఇప్పట్లోనే రాడట. ఇదిగో ఉత్తరం వచ్చింది." అంటూ ఉత్తరాన్ని పార్వతమ్మమీదకు గిరవాటు వేశారు.

పార్వతమ్మ ఆ ఉత్తరాన్ని విప్పకుండా అలాగే ప్రక్కకి తోసివేసింది.

"మన రాజేశ్వరరావు మాస్టారు కూర్చొన్నారు. ఇంకా మీరు చూడలేదా ?" అంటూ భర్తకి విద్యుక్తధర్మాన్ని జ్ఞప్తికి తెచ్చింది.

"ఆ. చూడకేం ? చూశాను. ఏమయ్యో మాస్టారు. రాత్రి సుబ్బరాజుని, మా జగదాంబని స్టేషనుకి దిగబెట్టావట కదూ. ఇటువంటి ఉద్యోగాలుకూడా కొత్తగాప్రారంభించావా?" అన్నారుఇంకొకవైపుచూస్తూ.

పెళ్లికొడుకు ఇప్పట్లో రాడు అన్న మాటలు వినగానే రాజేశ్వరరావు మనస్సు ఒకసారి ఎగిరి గంతులేసింది. ఇప్పటివరకు అన్ని శుభసూచకాలే అనుకొన్నాడు. అతడికి ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది.

"అసలు జరిగిందేమిటో తెలుస్తే మీరు నాతో ఈవిధంగా మాట్లాడరు" అన్నాడు రామయ్యగారితో.

"అదేమిటండి, అలా మాట్లాడతారు ? జరిగిన విషయం ఏదో ఈయన ద్వారా తెలుసుకోకుండా అలా నిందిస్తా రేమిటి ? ఇంతకీ మీ చెల్లెలికి బుద్ధిలేకపోయాక ఇతరులని అనుకొంటే ఏమిటి [illegible] ?!" అన్నది పార్వతమ్మ.

"జరిగిన దేమిటంటే—" చెప్పడం మొదలెట్టాడు రాజేశ్వరరావు—

"తెల్లవారుజామున మూడు గంటల్కి



నా గది తలుపు ఎవరో కొట్టారు. తలుపు తీశాను. జగదాంబ. ఎందుకు వచ్చారని అడిగాను. తూర్పు వెళ్లే ప్యాసింజరుకి తను అర్జంటుగా వెళ్లవలసి వచ్చిందని, స్టేషను వరకు నన్ను సహాయం రమ్మని చెప్పింది. పార్వతమ్మ లేరా అన్నాను. లేరు అన్నది. రామయ్యగారు లేరా అన్నాను. వూళ్లో లేరు అన్నది. మీ పెనుతలకి ప్రయివేటు చెప్ప వద్దన్నప్పటికీ, మీ గుమ్మం తొక్కవద్దని మీరు నాకు కబురు పంపినప్పటికీ, నాకు మాత్రం మీ అందరిపైన అభిమానం పోలేదు. మీ అవసరాలకి సహాయపడడమే నా ధ్యేయం. అందుచేత ఆమెకి సాయంగా స్టేషనుకి వెళ్లాను. మేము స్టేషనుకి చేరే టప్పటికి అక్కడ సుబ్బరాజు మాకు కలిశాడు. ఇద్దరికి టిక్కెట్లు అతడే కొన్నాడు. రైలు రాగానే ఇద్దరూ ఒకే పెట్టెలో కూర్చున్నారు. అంతవరకు నాకు ఏ అనుమానం లేదు. కాని అప్పుడు సందేహం కలిగింది.

"మీ రిద్దరూ కలిసి వెళతారా ?' అని అడిగాను.

'అవును' అన్నారు వాళ్లు. స్టేషనులో గంట కొట్టారు.

"ఎక్కడికి?' అన్నాను నేను.

'అన్నవరం' అన్నది జగదాంబ. గార్డు విజిలు కొట్టాడు.

# బ్రహ్మముడి

'ఎందుకు ?' అన్నాను నేను.

'పెళ్లికి' అన్నాడు సుబ్బరాజు. ఇంజను కూతవేసింది.

'ఎవరి పెళ్లి?' అన్నాను నేను.

'మా పెళ్లి!' అన్నారు ఇద్దరూను. రైలు కదిలిపోయింది.

"ఏం చేయను? అనవసరంగా ఈ వ్యవహారంలోకి నన్ను దింపారు. నాకు ఏ తల వంపులు వస్తాయో, ఎవరిచేత మాటలు పడాలో అని క్రుంగిపోతూ ఇంటికి దారి తీశాను'' అని జరిగిన కథ చెప్పాడు రాజేశ్వర్రావు.

"చూశారా ? పాపం అతడు అను కొన్నట్లే మీరు నిజం తెలుసుకోకుండా నిష్ఠూరం వేశారు'' అన్నది పార్వతమ్మ భర్తతో.

"అవునండి మాష్టారు. వాళ్లిద్దర్నీ మీరు రైలు ఎక్కించడం చూసినవాళ్లెవరో చెప్తే నేను అన్యథా భావించాను. అది చేసిన పనికి నా మనస్సు వికలమయిపోయింది. నా బాధ మీరు గుర్తిస్తారనే నేను అను కొంటున్నాను'' అన్నారు రామయ్యగారు ప్రాధేయపడుతూ.

"మీరెంత బాధపడుతున్నారో నాకు పూర్తిగా తెలుసును'' అన్నాడు రాజేశ్వర్రావు.

"ఒకసారి ఇటురా వస్తారా" అంటూ భర్తని వంటింటిలోకి తీసుకొని వెళ్లింది పార్వతమ్మ.

"స్వర్ణని వివాహం చేసుకోమని అతడిని కోరండి. అతడికి స్వర్ణ అంటే ఎంతో ప్రేమ. సంతోషంగా అంగీకరిస్తాడు. ఆ జగదాంబ బావగారి అబ్బాయి గురించి మనం ఆశ వదులుకోవలసిందే. ఉదయంనుండి నేను అదే ఆలోచిస్తున్నాను. అసలే వాళ్లు ఇష్టంలేనట్లు కనబడుతున్నారు. ఇప్పుడు జగదాంబ ఇటువంటి పని చేసిందని తెలుస్తే వాళ్లు ఎంతమాత్రం చేసుకోరు. ఇతడిని ఈపూట ఇక్కడే భోజనంచేసి వెళ్ల మని చెప్పండి'' అని రహస్యంగా చెప్పింది.

కాని పొంచి వింటున్న స్వర్ణకి ఈ రహస్యం వినిపించింది. ఆమె ఆనందాన్ని పట్ట లేకపోయింది. ఒక్క పరుగున చావిట్లోకి దారితీసింది. అదే సమయానికి రాజేశ్వ ర్రావు కూడా చావిట్లో ప్రవేశించాడు. అతడిని చూసి సిగ్గుతో తిరిగి స్వర్ణ పారి పోవడానికి ప్రయత్నించింది. రాజేశ్వర్రావు ఆమె చెయ్యి పట్టుకొన్నాడు.

"ఈ కొత్త సిగ్గేమిటి ? నీ ముఖం ఆనందంతో కలకలలాడిపోతోంది. ఏమిటి కథ?'' అని అడిగాడు.

"ఇంకేముంది ? మన ఆశయం ఈనా టికి ఫలించింది'' అన్నది స్వర్ణ చిన్న గొంతుకతో.

"హుర్రే ! ఇప్పటికి లైన్ క్లియర్ అయిందన్నమాట'' అంటూ స్వర్ణని అమాం తంగా ఎత్తి కుర్చీలో కూర్చోబెట్టాడు రాజేశ్వర్రావు.

"అన్నట్టు లైన్ క్లియరంటే జ్ఞాపకం వచ్చింది. ఇందాకటు, రాత్రి జరిగిన కథ ఎంత తమాషాగా కల్పించి చెప్పారు! నిజంగా ఏమిటి జరిగిందేమిటి?'' అని స్వర్ణ ప్రశ్నించింది.

రాజేశ్వర్రావు తెల్లబోయాడు. "అదే మిటి ? నిజంగా జరిగిందే చెప్పాను'' అన్నాడు.

"అలాగా ! అయితే ఈ ప్రశ్నలకి జవాబు చెప్పండి. మా అత్తయ్య మీ బసకి ఎన్ని గంటలకి వచ్చిందన్నారు ?''



"సరిగ్గా మూడు గంటలకి రాత్రి ఎప్పుడు లేచినా నాకు టైము చూడడం అలవాటు."

"మరి తూర్పు వెళ్లే ప్యాసింజరు ఒంటి గంటకి వస్తుంది. ఆ రైలు అందుకోవడం అసాధ్యం అని ఆమెతో మీరు ఎందుకు చెప్పలేదు ?"

"అందకపోవడ మేమిటి ? అది మూడు గంటలు లేటు కదూ. నాలుగు గంటలకి వచ్చింది. మేము స్టేషనుకి చేరడానికి ఒక గంట పట్టింది. అంతా సరిగ్గా సరిపో యిందే."

"అదే ! మీరు వేసిన లెక్క సరిపో యింది. కాని స్టేషనుకి వెళ్లకుండానే ఆ ప్యాసింజరు మూడు గంటలు లేటని మీకు ఎలా తెలిసింది.? బహుశ కల వచ్చి ఉంటుంది" అన్నది స్వర్ణ నవ్వుతూ.

"ఏమిటీ, ఏమిటీ" అంటున్నాడు రాజేశ్వ్రరావు గాభరాపడుతూ.

"మీ సహాయం కోరుతూ జగదాంబ మీ బసకి వచ్చిందని చెప్పినప్పుడే మీ కథ నిజంకాదని రూఢి అయింది. మీ ఇల్లు సుబ్బరాజు ఇల్లు ఒకటే. ఆమె అక్కడి వరకు వచ్చి మీ సహాయం కోరడమేమిటి ? అదిగాక మీరంటే ఆమెకి ఎంత కోపమో అందరికి తెలుసును. అటువంటిది మీ సహాయాన్ని అర్థిస్తూ ఆమె మీ వద్దకు వస్తుందా" అన్నది స్వర్ణ.

"భేష్, స్వర్ణా నీ తెలివితేటలు అద్భుతం వయం. నీవద్ద ఏదీ దాచడానికి వీలులేదని ముందుగానే తెలియచెప్పావ్! నేను మీవాళ్లతో చెప్పిందంతా ప్యూర్ గ్యాస్. నిజం కథ వేరే ఉన్నది. సావకాశంగా నీతో చెప్తాలే" అన్నాడు రాజేశ్వ్రరావు నవ్వుతూ.

"రాజేశ్వ్రరావ్! ఈ పూట నువ్వు ఇక్కడే భోజనం చెయ్యాలి సుమా. అన్నట్లు నీతో ఒక ముఖ్యమయిన విషయం గురించి మాట్లాడాలి. ఇలా నాతో వస్తావా?" అంటూ రామయ్యగారు చావిట్లోకి వచ్చారు.

"పదండి నేను సిద్ధంగానే ఉన్నాను" అంటూ ఆయన వెంటపడ్డాడు రాజేశ్వ్రరావు. ●

# పల్నాటి యుద్ధం

(గత సంచిక తరువాయి)

నలగామ రాజు కుమార్తె పేరిందేవి నవయువ్వన విలాసినిలా చెలికత్తెలతో వనవిహారం చేస్తుండగా అలరాజు అటువైపు వెళ్ళి లీలగా చిన్ననాటి మధుర స్మృతులు స్ఫురణకు రాగా ఆమెను దప్పిక తీర్చుకునేందుకు మంచితీర్థ మిమ్మని అడిగాడు. "అంతఃపుర స్త్రీల ఉద్యానవనంలో ఆగడాలు ఏమిటి?" అని కసరింది ఆమె. అలరాజు రాజమందిరం వైపు వెళ్ళిపోయాడు!

నరసింహరాజు దగ్గరకు పేరిందేవి వెళ్ళి "ఎవరో రాజకుమారుడి లాగానే యున్నాడు. దాహ మిస్తారా యని మాతోనే పరిహాసాలు మొదలుపెట్టాడు" అని ఫిర్యాదు చేసింది.

"ఆ దుర్మార్గుడ్ని శిక్షించవలసిందే" అని పేరిందేవిని నలగామరాజు అలరాజు కూర్చుని ముచ్చటిస్తున్న చోటకు తీసుకువెళ్ళి "ఈ దుర్మార్గుడేనా? ఏం ఆశ్చర్యపోయావ్! మీ బావ అలరాజమ్మా" అని నవ్వుతూ పరిచయం చేసాడు నరసింహరాజు.

పేరిందేవి సిగ్గుతో తలవంచుకుంది. తరువాత పళ్ళరసం తెచ్చి యిచ్చిన పేరిందేవితో "గురజాల వచ్చినందుకు గుక్కెడు మంచినీళ్ళిస్తే సరిపోనే" అన్న అలరాజుతో, "ఒక్క చుక్కైనా మంచినీళ్ళివ్వం, గురజాలవారు బంధువులకు ఫలరస మివ్వడమే ఆచారం" అన్నది పేరిందేవి. మలిదేవరాజువివాహం గురించి వేగుల ద్వారా తెలుసుకున్న నాగమ్మ "మహాభారతంలో పాండవులు ద్రౌపదిని పరిగ్రహించినట్లు బ్రహ్మన్న దూర దృష్టితో వేసిన ఎత్తుగడయింది" అనుకున్నది. అన్నమ్మ అనే రాణివాసపు దాసి, రాజకుమారి మాచర్ల ప్రయాణ సన్నాహాలు గురించి ఆమెకు తెలియజేస్తూ, అలరాజుపై ఆమె మక్కువగొని యున్నదని తెలియజేసింది.

నలగామరాజుకు, నరసింహరాజుకు ఈ పెళ్ళి సంబంధం నిర్ణయించుటలో బ్రహ్మన్న ఎత్తుగడ గురించి ప్రస్తావిస్తుండగా "నీ వేమిటి హర్షించావ్, ఎప్పుడు హర్షించావ్? మా పల్నాటిసీమ పచ్చగా వుండటం హర్షించావా? పదిమంది పొత్తుగా వుండటం నీవు హర్షించావా?" అని పరుషంగా మాట్లాడింది పేరిందేవి.

"ఎవరు వచ్చినా రాకపోయినా నేను పెళ్ళికి వెళ్ళి తీరుతాను" అన్నది.

"ముఖ్యంగా నీవే వెళ్ళకూడదు" అన్నది నాగమ్మ.

"ఎందుకు?" అన్నది పేరిందేవి నిప్పులు గ్రక్కుతూ.

"పిచ్చిపిల్లా, రేపోమాపో అలరాజుకి నిన్నిచ్చి వివాహం చేసి పలనాటి రాజ్యాన్ని మీకు కట్టబెట్టాలనుకుంటున్నప్పుడు మహారాజు మర్యాద కూడా దక్కనిచ్చేట్లులేవే" అన్నది నాగమ్మ. అమృత సమానమైన ఆ మాటలతో పేరిందేవి పొంగిపోయింది. ఆనందం ముప్పిరిగొనగా పేరిందేవి నాగమ్మ కాళ్ళ మీద పడి తన తప్పు క్షమించమని వేడుకొంది.

నలగామరాజు తొలి నిర్ణయం మార్చుకొని మాచర్ల వెళ్ళడం విరమించుకున్నాడు. అలరాజుకు తన కుమార్తె నిచ్చి వివాహం జరిపించదలచినట్లు వర్తమానం పంపాడు. మలిదేవరాజు పట్టాభిషిక్తుడయ్యాక అలరాజు పేరిందేవిల వివాహానికి మాచర్ల నుండి అందరూ తరలివెళ్ళారు.

వివాహానికి ఏర్పాట్లన్నీ భారీ ఎత్తున జరిగాయి. నాగమ్మకు బ్రహ్మనాయునికి కోడిపందాల యందుగల మక్కువ తెలుసు కనుక విడిది బయట కోడిపందాలు ఏర్పాటు చేయమని వీరభద్రునికి పురమాయించింది. అతడు ఏర్పాటు చేసిన కోడిపందాలు జరుగుతుండగా మాచర్ల కోడి పారిపోయిందని ఎద్దేవా చేయసాగారు కొందరు ప్రేక్షకులు. "ఏమిటీ ప్రేలాపన! మాచర్ల కోడైతే మడం తిప్పుతుందా, ఎదుట కోడిని ఎగరనిస్తుందా?" అని మీసం దువ్వాడు బ్రహ్మన్న.

"ఆ దౌర్భాగ్యమైన కోడి పుట్టింది గురజాలలోనే కాని మాచర్లలో కాదు" అన్నాడు కన్నమదాసు.

"మా గడ్డలో పుట్టినవి తిండిపోతులు కావు కన్నమదాసూ, అని నిగ్గుదేరిన నెమలి డేగలు" అన్నాడు నరసింహరాజు వ్యంగ్య ధోరణిలో.

అది విన్న మలిదేవరాజు ఆగ్రహించి "ఇక్కడి మనుష్యులకు వెన్ను పొడవడం తెలుసుకానీ, ఎదురు నిల్చి పోరాడే పౌరుషాలెక్కడివి" అని ఎత్తి పొడిచాడు.

నాగమ్మకు ఆమాట కలుక్కుమంది.

ఆమె ప్రసన్నంగానే "ఆ, ఆ ఇప్పుడు తెలిసిందిగా ప్రతాపం" అన్నది. బ్రహ్మన్న అభిమానం దెబ్బ తిన్నది.

"సరే, మాచర్ల కోళ్ళ ప్రతాపం చూడదలచుకుంటే మా కోళ్ళను యిక్కడికే తెప్పిస్తా" అన్నాడు బ్రహ్మన్న.

"అంతేకాదు ఆ పందెంలో ఎవరోడిపోతే వాళ్ళు ఏడు సంవత్సరాలు అరణ్యవాసం చేయాలి" అన్నాడు మలిదేవరాజు. ఉద్రేకంలో నోరుజారిన మలిదేవ మహారాజు మాటే ఖాయమైంది. కోడి పందాలకు ముహూర్తం సైతం నిర్ణయమయింది.

కోడిపోరు కూడా మాయోపాయం ఉపయోగించి గెలవాలనుకున్నది నాగమ్మ. అందుకు తగు ఏర్పాట్లు ముందుగానే చేసింది. తన కోడికి గుప్తమైన రక్షణ కవచం తొడిగించింది. కోడిపోరులో మాచర్ల కోడి "చిట్టెమల్లు" ఎంత చక్కగా చాకచక్యంగా పోరాడినా ప్రయోజనం లేకపోయింది. దానికి ఒడలంతా గాయాలు తగిలాయి. గురజాలవారి నెమలిడేగకు గాయమే లేదు. చిట్టెమల్లు వీరోచితంగా పోరాడి బరిలో రక్తం గ్రక్కి చనిపోయింది. ఇంతలోనే బరిలోంచి గురజాల నెమలి డేగను తప్పించి వేసారు. బ్రహ్మన్న పక్షాన కోడిని బరిలోకి దింపిన గోపన్న అనుమానం దృఢమై కోడితో బాటు ప్రజల్లోకి గాలిలా దూసుకుపోయాడు. అతన్ని గురజాలవారు హత్య చేసారు.

ఉభయ పక్షాలవారు ఉద్రిక్తులై యుండగా తన వారిని శాంతపరుస్తూ "ఆగండి. కత్తులు దూయుడానికిది కదనభూమి కాదు" అన్నాడు బ్రహ్మన్న.

"ఈ ఆర్భాటాలెందుకు బ్రహ్మన్నగారూ! అపజయాన్ని అంగీకరించండి" అంది నాగమ్మ.

ఈమాటకు మలిదేవరాజు అడ్డువచ్చి "బరి నుండి మీ కోడి పారిపోయింది కనుక విజయం మాదే" అన్నాడు.

ఇది అందరకూ కలిగిన ధర్మసందేహం, క్లిష్టమైన ఈ తీర్పు చెప్పడానికి న్యాయవర్తనుడైన అలరాజును ఉభయపక్షాల వారు న్యాయనిర్ణేతగా ఎన్నుకున్నారు. గురజాలవారి నెమలి డేగను తెప్పించి బరిలో వున్న చిట్టెమల్లుపై విడిచాడు. నెమలిడేగ మొగిసింది. అందువల్ల ఆ డేగ భీరువు కాదని న్యాయ నిర్ణయం చేసాడు అలరాజు. ఓటమి ఒప్పుకుని మలిదేవాదులు మాచర్ల వెళ్ళిపోయారు.

నాగమ్మ చిరకాల వాంఛ నెరవేరింది. అన్నదమ్ముల మధ్య అగ్ని రగులుకొన్నది. మలిదేవాదులు అరణ్యవాసానికి సిద్ధమయారు. వారితో బాటు తానూ అరణ్య వాసానికి పోగలనంటూ మామగారి సెలవు



కోళ్ల పందెం

తిరచాడు అలరాజు. కృతనిశ్చయుడైన అలరాజుకు నలగామరాజు ఎన్ని విధాలుగా చెప్పినా ప్రయోజనం లేకపోయింది. పేరిందేవి కూడా భర్తతో అరణ్యవాసానికి పోతానని, అనుమతించమని తండ్రిని వేడుకొన్నది. "మీరిద్దరూ నాకు రెండు కళ్ళు. నా చేతో నే నారెండు కళ్ళూ పొడిచివెళ్ళమ్మా." అని వాపోయాడు. ఆస్థితిలో యున్న తండ్రిని చూచి ఆమె హృదయం ద్రవించిపోయింది.

బ్రహ్మనాదులు మలిదేవాదులను వెంట బెట్టుకుని విశేష గోగణంతో మండాది అడవులలో విడిది చేసారు. "బ్రహ్మన్న, కొమరాజు, కన్నమనాయుడు శ్రీశైల రాజువద్దకు వెళ్ళి కొంత ధనం అప్పుతెచ్చారు. మలిదేవాదులకు ఇబ్బంది కలిగించేందుకు విన్నహాయ స్థితిలో ఉన్న వారి గోగణాలను తరలించే పన్నాగం చేసింది. అలరాజు, కన్నమదాసు చెంచు మూకలను చెల్లాచెదురు చేసి గోగణాన్ని రక్షించారు. శ్రీశైల మహారాజు వద్ద అభ్యమైన ధనంతో వీరమేడపి నగరాన్ని నిర్మించుకుని అచట స్థిరపడ్డారు.

మాంచాల పెరిగి పెద్దదైంది. ఆమె పుట్టక ముందే ఆమెను బాలచంద్రుని కిచ్చి వివాహం చేస్తానని చెన్నకేశవునిపై ప్రమాణం చేసి చెప్పాడు బ్రహ్మన్న. మాంచాల యుక్తవయస్కురాలయ్యే సరికి బాలచంద్రుణ్ణి అజ్ఞాతవాసం నుండి బయటకు తీయవలసినతరుణ మాసన్నమైందని కన్నమనాయుడు భావించాడు.

కన్నమనాయుడు యాదవ చంద్రమ్మ యింటిలో ప్రవర్ధమానుడై పెరిగిన బాలచంద్రుణ్ణి వెంట బెట్టుకుని మహామంత్రి బ్రహ్మన్న నివాసానికి వెళ్లాడు. గవాక్షంలోంచి ఆ యువకుడు గుర్రం మీద స్వారి చేస్తూనే తలపాగా సరిచేసుకోవడాన్ని చూచి ఐతాంబ తన భర్త అలా చేసేవారని గుర్తుకు వచ్చి ఆ యువకుడిలో ఆ పోలికలు కానవచ్చి తన కొడుకే యీడువాడై యిలా వుండేవాడు కదా అన్న ఆలోచన కల్లోలపర్చగా మూర్ఛపోయింది. బాలచంద్రుడు బ్రహ్మనాయుడి కంటబడే సరికి బ్రహ్మనాయుడు దిగ్భ్రాంతుడయాడు. "ఏవ రబ్బాయి నువ్వు" అని అడిగాడు.

"పల్నాటి మహామంత్రి బ్రహ్మనామాత్యుల వారి కుమారుణ్ణి, నాపేరు బాలచంద్రుడు" అంటాడు దర్పంతో ఆ నవయువ్వనుడు!

"ఇంకా నువ్వు బ్రతికే వున్నావా?" అంటూ తన కత్తిని బలంగా బాలచంద్రుని మీదకు విసిరాడు. బాలచంద్రుడు బ్రహ్మన్న ప్రచండయుద్ధం చేసారు. బ్రహ్మన్న చేతి కత్తిని నరికి ముక్కల చేసాడు బాలచంద్రుడు. రోషంతో బ్రహ్మన్న రాగోల చేత ధరించాడు. "జై చెన్నకేశవా" అంటూ ఒక్క వేటుకు బాలచంద్రుని శిరస్సును ఖండించ నుద్యమించాడు! అంతలో మూర్ఛ నుండి తేరుకున్న ఐతాంబ, రేఖాంబ కన్నమనాయుడు బాలచంద్రుడున్న చోటుకు వెళ్ళారు. ఐతాంబ భర్తకు శాంతించమని ప్రాధేయపడింది. బాలచంద్రుడు తాను పోరాడు తున్నదని తండ్రితోయని తెలుసుకుని ఆయన పాదాలపై బడి క్షమాభిక్ష వేడుకున్నాడు.

చెన్నకేశవుని కృపవలన బ్రహ్మన్న తన ప్రమాణం నిలబెట్టుకుని మాంచాల బాలచంద్రుల వివాహం అతివైభవంగా జరిపించాడు. తన వంశాచార ప్రకారం భార్యాభర్తల్ని ఒకరికరు చూచుకోకుండా పరదాల చాటునే మాంగల్యధారణ చేయించారు. వివాహానంతరం సజ్జాయి నృత్య వినోద కాలక్షేపం



అలరాజు పానీయంలో విషం కలుపుతున్న నరసింహరాజు

ఏర్పాటు చేసారు, కాని పాని సజ్జాయిపై బాలచంద్రుని కన్నుపడింది.

శోభనపు గది కనులపండువుగా అలంకరించారు. సుగంధ పరిమళ ద్రవ్యాలతో మందిరం ఘుమఘుమ లాడింది. బాలచంద్రుడు ఆ మందిరంలో ఉప విష్టుడై యున్నా అతని మనసు సజ్జాయి మీదనే యున్నది. కృతనిశ్చయుడై తృటిలోసజ్జాయియింటికి వెళ్ళాడు. అయితే మాంచాల ఈసంగతిఎవరికీ తెలియ నివ్వలేదు. ఐతాంబకు పరిచారికల వల్ల తెలిసింది. భర్తతో ఫిర్యాదు చేసింది. దానికి బ్రహ్మన్న "మన అరణ్యవాసం పూర్తి కావచ్చింది. మలిదేవరాజు మాచర్ల తిరిగి అప్పగించవలసిందని నలగామరాజు వద్దకు రాయబారం పంపబోతున్నాడు. బాలచంద్రుడుంటే సంధి భగ్నం కావచ్చు" అంటూ తన పుత్రుడు వేశ్యా లోలుడవటం బాధాకరమే యియినా అప్పటికి ఉపేక్షాభావం వహించుటయే యుక్తమన్నాడు.

తల్లితో మాంచాల పుట్టింటికి వెళ్ళింది. మూగ బాధ ననుభవిస్తూ ఉండిపోయింది.

బ్రహ్మనాదులు అలరాజును నలగామరాజు కడకు రాయబారిగా పంపారు. ఈ వార్త తన కూతురికి సంతోషాన్ని కలిగించగలదని నలగామరాజు ఆమెకు స్వయంగా తెలియ చేశాడు.

అలరాజు రాయబారం నాగమ్మను నరసింహ రాజును కర్తవ్యోన్ముఖులుగా చేసింది. అరణ్య వాసం గడువు ముగిసింది కనుక వారు తిరిగి రాజ్యం పంచి యిమ్మంటారని అంది. పొసగకుండా చేయాలని వారాలోచన చేసారు. అలరాజును మట్టుపెట్టటమే సంధి భగ్నమవడానికి ఏకైక మార్గమని వారు భావించారు. నాగమ్మ నరసింహరాజును ఆ పనికి నియోగించింది. సింహాసనానికి అలరాజే అడ్డు అన్నమాట నమ్మి అన్న కుమార్తె మాంగల్యం తెంపి వేయడానికి వెనుకాడలేదు నరసింహరాజు.

నిండు కొలువు వాలియున్న నలగామరాజు సమక్షానికి అలరాజు వెళ్ళి అర్ధరాజ్య మిమ్మని మలిదేవ రాజు అడిగిన విషయం తెలియబరచాడు. నాగమ్మ నరసింహరాజుల పుల్లవిరుపు మాటల వల్ల మాటా మాటా పెరిగి "సంధి వలన మీరివ్వకపోతే సమరంలో మేమే తేల్చుకుంటాం" అని గర్జించాడు అలరాజు.

"ఉత్తరకుమార ప్రజ్ఞలు మేము చాలా విన్నాం" అని చులకన చేసింది నాగమ్మ. ఆవేశాలు పెరిగాయి. ఆఖరి మాటగా 'సంధి మాట ఏమి చెబుతారు?' అని అడిగాడు అలరాజు.

"సంధి కుదరదు!" అని తెగేసి చెప్పింది మహారాజు తరఫున నాగమ్మ.

"అయితే యిక యుద్ధమే తథ్యం" అన్నాడు అలరాజు కృతనిశ్చయుడై.

"శివశివా! కులభ్రష్టుడైన బ్రహ్మన్నతో యుద్ధమా?" అని చెవులు మూసుకుంది నాగమ్మ. "పురుషోత్తముడైన బ్రహ్మన్ననే నిందిస్తావా, పాపీ!" అంటూ ఒళ్ళు తెలియని ఆవేశంలో పళ్ళు పటపటా కొరుకుతూ కత్తి విసిరాడు అలరాజు. నాగమ్మ నాయులా వెన్నంటి యున్న వీరభద్రుడు ఆ కత్తిని చేతితో బట్టి అవతల పారవేసి కత్తి విసరిన అలరాజు మీదకు లంఘించాడు. అతడ్ని తృటిలో నిరోధించాడు అలరాజు అంగరక్షకుడు కన్నమదాసు. నలగామరాజు ఉభయులను వారించాడు.

నలగామరాజు జరిగిన విషయాలకు పరితాపాన్ని ప్రకటిస్తూ అల్లుడ్ని ఒక్కమారు కూతురికి ముఖం చూపించి వెళ్ళమన్నాడు. మలిదేవ మహారాజు సింహాసన మధిష్ఠించేంత వరకూ ఈ ఎడబాటు తప్పదన్నాడు అలరాజు. అల్లుడ్ని కనీసం ఫలరసమైనా తీసుకువెళ్ళమని ప్రాధేయపడ్డాడు నలగామరాజు. అలరాజు, కన్నమదాసు ఎంత చెప్పినా వినకుండా మెత్తబడ్డాడు.

పళ్ల రసంలో అలరాజుకి విషం కలిపి ఇచ్చింది నాగమ్మ. గురజాల పొలిమేర దాటకముందే అతడు మరణించాడు. కన్నమదాసు ఆ వార్త తీసుకుని రాజ మందిరానికి వెళ్ళాడు. ఆవార్త విన్న పేరిందేవి శూలాఘాతం తిన్న లేడిపిల్లలా కూలిపోయింది. నాగమ్మ "ఈ దుర్మార్గులే ఆయనను దారిలో హత్య చేసి యుంటారు. ఈ నేరం మీ మీద మోపడానికి బ్రహ్మన్న పన్నిన కుట్ర యిది." అన్నది మహారాజుతో!

"మీరేం చేసినా సర్వనాశనమైనది. నేనుకే చెయ్యెత్తి నమస్కరించినందుకు నిలానే వుండమని దీవించావు. పగబట్టిన పాములా నా భర్తను కాటు వేసావు" అని పేరిందేవి నాగమ్మను దులిపేసింది. తరువాత నరసింహరాజుతో "ఈ పల్నాటి రాజ్యాన్ని, ఈ మహాపాతకాన్ని మీరే మూటగట్టుకోండి" అని కన్నమదాసుతో వెళ్ళిపోయింది పేరిందేవి. (సశేషం)




ఆంధ్రదేశంలో అసంఖ్యాకంగా థియేటర్లున్నాయి. ఈ థియేటర్లలో రకరకాలున్నాయి. నగరాలలో ఉండే థియేటర్లకు, పట్టణాలలో ఉండే థియేటర్లకు పోలికలే ఉండవు. అలాగే పట్టణాల్లో ఉండే థియేటర్లకు, మారుమూలల్లో ఎక్కడో గ్రామాల్లో ఉండే థియేటర్లకు ఎన్నో వ్యత్యాసాలుంటాయి. ఈ వ్యత్యాసం ముఖ్యముగా రూపంలోను, అక్కడ ఉండే వసతుల్లోను ఉంటుంది. ఆ ప్రాంతంలో నివసించే ప్రజలనుబట్టి వారి అలవాట్లనుబట్టి అక్కడి థియేటర్లు రూపొందుతూ ఉంటాయి. అందువలన యీ వ్యత్యాసాలు ఉండటం ధర్మం మాత్రమే గాక ఒకరకంగా వాంఛనీయం కూడ. చిన్న పల్లెటూళ్ళు ఉన్నాయంటే అక్కడ చిన్న థియేటరు ఉంటుంది. కారణం అక్కడ నివసించే ప్రజల స్థోమత సాధారణంగా అంతవరకే పరిమితమై ఉంటుంది. అలా అనుకుంటే తాత్కాలికమైన గుడారాలలో మూడున్నర గంటల కథను తెర మీద నడిపించగల యీ చిన్న థియేటర్లను ఏమనాలి? పట్టణాల్లో ఒకమోస్తరు థియేటర్లు ఉన్నాయి. నగరాల్లో అంతకంటె మంచి థియేటర్లు ఉన్నాయి.

వ్యక్తుల అంతస్థులను బట్టి, పట్టణాల అంతస్థులనుబట్టి మారుతూఉండే యీ థియేటర్లు అన్ని రాష్ట్రాలతోపాటు తెలుగు దేశంలో కూడా బాగా సంస్కరించబడవలసిన అవసరం కనిపిస్తున్నది. పట్టణాలలోను, గ్రామాల్లోను ఉండే కొన్ని థియేటర్లు యీనాడు లోపభూయిష్ఠంగా ఉన్నాయి. వీటి అన్నిటికి సవరణలు కావాలి. కాని అది ఎంతవరకు సాధ్యం అని అన్నదే యీ రచయిత సందేహం.

ఉదాహరణకు యిందుకు సంబంధించిన కొన్ని లోపాలు చెప్పుకుందాం. ప్రేక్షకులకు కావలసిన మొదటి సదుపాయం టిక్కెట్లు గనుక యీ టిక్కెట్ల పంపిణీలోనే ఎన్నో గల్లంతులు జరుగుతుంటవి. చాలచోట్ల క్యూ పద్ధతి ఉన్నప్పటికీ యీ పద్ధతి అట్టే ప్రయోజనకరంగా కనిపించదు. బుకింగ్ కౌంటర్ తెరచేవరకూ క్యూ బాగానే ఉంటుంది. ఆ తరువాతనే క్యూ విచ్చలవిడిగా చెల్లాచెదురై పోతుంది. చెల్లాచెదురై పోయిన క్యూలో టిక్కెట్టు యివ్వడం ఎంత కష్టమో టిక్కెట్టు పుచ్చుకోవడం కూడ అంతే కష్టం. ఇందువల్ల ఎవరికీ లాభంలేదు. క్రొత్త సినిమాలు విడుదలైన మొదటి రెండు వారాల్లో ఈ పరిస్థితి బాగా కనిపిస్తుంది.

రెండవ సమస్య బ్లాక్ మార్కెట్. కొన్ని థియేటర్లలో బ్లాక్‌మార్కెట్ విపరీతంగా జరుగుతుండటం వల్ల చాల నష్టాలు కలుగుతున్నాయి. క్యూలో ఉన్నప్పటికీ నిజంగా టిక్కెట్లకు అర్హులైనప్పటికీ బ్లాక్‌మార్కెట్టు మూలంగా కొందరకు దొరకవు. ఈ బ్లాక్‌మార్కెట్టు ఎవరు చేస్తున్నారనేది కూడా చర్చనీయాంశమే. అక్కడక్కడ కొన్ని థియేటర్ల యాజమాన్యానికి కూడా యీ బ్లాక్‌మార్కెటుతో సంబంధము ఉందని వింటూంటాం. ఇదే నిజమైతే మన పరిస్థితికి మనం సిగ్గుపడాలి, మనం ముందుకు వెళ్తున్నామా? లేక—వెనకకు వెళ్తున్నామా? అని సందేహం.

## ప్రభుత్వాధికారుల ప్రాబల్యం

ఒక థియేటరును నడిపించటానికి సహనము, సహనాన్ని మించిన పట్టుదల కావాలి. ఎందర్నో కూడగట్టుకొని రావాలి. వీళ్లలో ముఖ్యులు పోలీసు అధికారులు, ఇతర పన్నుల అధికారులు. థియేటర్లకు తమతో ఉండే అవసరాన్ని పురస్కరించుకొని వీరంతా ఫ్రీ టిక్కెట్లకోసం ఎదురుచూడడం స్వయముగా యీ రచయితకు తెలుసు. థియే



టర్లవారికి కూడ ఎన్నో సమస్యలుంటాయి. అలాంటి స్థితిలో వీరంతా వెళ్ళి టిక్కెట్ల కోసం ఎదురుచూడటం వలన థియేటరు వారిని యిబ్బంది పెట్టడమే కాక తమ వ్యక్తిత్వపు స్థాయిని ఒక మెట్టు దించుకున్నవా రవుతారు. దీనిని అరికట్టవలసిన బాధ్యత ఆయా వ్యక్తులమీదనే గాక ప్రభుత్వంమీద కూడా ఉన్నది.

### విశ్రామసమయంలో

పది నిముషాలసేపు విశ్రాంతి అంటారు. నగరాల థియేటర్లు పరవాలేదు కాని యితర ప్రాంతాల థియేటర్లలో ఏమాత్రం అవకాశాలు లేవు. టీ, కాఫీ సదుపాయాలు సరిగా ఉండవు. బాత్‌రూమ్‌లు కూడా పరిశుభ్ర




ముగా ఉండాలి. అవుట్‌ప్యాస్‌లు మార్చుకొనడం, అమ్మటం, అరికట్టాలి.

ఫర్నిచర్ పట్ల మరికొంత శ్రద్ధ అవసరం. కుర్చీలలో నల్లులు ఉండటం, యివి మరీ బాధాకరం కావటం థియేటర్ల స్థాయిని వెలిబుచ్చుతాయి.

### ముగించేముందు రెండుముచ్చట్లు:

ఒకసారి ఒక తల్లి తన పాపాయిని ఎత్తుకొని సినిమాకు వచ్చిందట. మధ్యలో పట్టేందుకు పాలసీసా కూడ తీసుకు వచ్చిందట. బాల్కనీలో కూర్చున్న ఆమె చేతిలోని పాలసీసా పొరపాటున జారి తక్కువ తరగతిలో ఉన్న ఎవరిమీదనో పడింది. ఆ సందర్భంలో చిన్న గలాటా కూడ జరిగింది. బాధపడ్డవారు కొందరైతే, నవ్వుకున్నవారు చాలమంది మిగిలిపోయారు.

—ధర్మాజీ ●

## పద్మశ్రీలకు అభినందనలు

సౌత్ ఇండియా ఫిలిం ఛాంబర్ ఆఫ్ కామర్స్ వారు యిటీవల భారత ప్రభుత్వంచే పద్మశ్రీ బిరుదును పొందిన నటీ నటులు శ్రీమతి భానుమతీ రామకృష్ణ, శ్రీ శివాజీ గణేశన్‌లను ఆహ్వానించి అభినందన సమావేశాన్నొకదాన్నేర్పాటు చేశారు. ఫిబ్రవరి పదవ తేదీన ఫిలిం ఛేంబర్ కార్యాలయావరణలో జరిగిన ఈ అభినందన సమావేశానికి పలువురు సినీ పెద్దలు, యితర ప్రముఖులూ విచ్చేశారు. శ్రీ ఏ. ఎల్. శ్రీనివాసన్ అధ్యక్షతన జరిగిన ఈ సమావేశం శ్రీ పి. బి. శ్రీనివాస్, ప్రార్థనాగీతంతో ప్రారంభం అయింది.

శ్రీ నాగిరెడ్డి తమ స్వాగతోపన్యాసంలో శ్రీమతి భానుమతీ రామకృష్ణ, శ్రీ శివాజీ గణేశన్‌ల నటన కౌశలాన్ని ప్రభుత్వం గుర్తించి వారికి పద్మశ్రీ బిరుదును ఇవ్వటం, వారిని అభినందించటానికి ఫిలిం ఛేంబర్‌కి అవకాశం లభించటం ఎంతో ఆనందంగా ఉందన్నారు.

శ్రీయుతులు ఎ. ఎల్. శ్రీనివాసన్, బి. ఎన్. రెడ్డి, ఉమాపతి, శ్రీమతి సౌందరం కైలాసంలు,పద్మశ్రీ భానుమతి,పద్మశ్రీ శివాజీ


పద్మశ్రీ శివాజీ గణేశన్

గణేశన్‌ల నటనా చాతుర్యాన్ని, ప్రభుత్వం వారికి పద్మశ్రీ యివ్వటంలోగల ఔచిత్యాన్ని పేర్కొని ముందు ముందు వీరు యింకా పెద్ద పెద్ద పెద్ద బిరుదులనుపొంది దక్షిణ భారత చలన చిత్రరంగానికి, భారతదేశానికి యింకా పేరు తేవాలని ఆశిస్తూ ఉపన్యసించారు. అనంతరం పద్మశ్రీ లిద్దరూకలసి తమ నాహ్వానించిన సౌత్ ఇండియా ఫిలిం ఛేంబర్ ఆఫ్ కామర్స్ వారికి, సభికులకు కృతజ్ఞతలను తెలిపారు. ●


పద్మశ్రీ పి. భానుమతి

## శ్రీ క్రిష్ణపాండవీయం

రామకృష్ణా, ఎన్. ఎ. టి. కంబైన్స్ వారు తాముநిర్మించిన పౌరాణికచిత్రం "శ్రీ క్రిష్ణ పాండవీయం" యిటీవల మద రాసులోని కృష్ణవేణి థియేటర్‌లో ప్రివ్యూషో వేశారు. ఈ ప్రదర్శనకు పలువురు సినిమా పెద్దలూ, ఇతర ప్రముఖులూ కూడా విచ్చేశారు. ఆహూతులకు శ్రీయుతులు ఎన్. టి. రామారావు, త్రివిక్రమరావు స్వాగతం చెప్పారు.

శ్రీకృష్ణుడు పాండవులను కాపాడుతానని కుంతికి అభయమివ్వటం, తర్వాత కుంతి పాండవులు వారణాసిలోని లక్క యింట్లో ప్రవేశించటం మొదలు శిశుపాలవధ వరకూ గల కథను ఈచిత్రంలో

చక్కగా చిత్రించారు. శ్రీకృష్ణ, దుర్యోధనులుగా ఎన్. టి. రామారావు ప్రశంశనీయంగా నటించారు. ద్విపాత్రాభినయం అద్వితీయంగా ఉంది. భీముడుగా ఉదయకుమార్, ధర్మరాజుగా బాలయ్య, అర్జునుడుగా శోభన్‌బాబు, జరాసంధుడుగా ముక్కామల, శిశుపాలుడుగా రాజనాల చక్కని నటనను ప్రదర్శించారు. రుక్మిణిగా కె. ఆర్. విజయ, చెలికత్తెగా గీతాంజలి, కుంతిగా ఎస్. వరలక్ష్మి, హిడింబిగా రత్న పాత్రోచితంగా నటించారు. ద్విపాత్రాభినయం చేసిన నటుడే దర్శకత్వం బాధ్యతనుకూడా తీసుకోడం, ప్రతిభావంతంగా నిర్వహించటం చెప్పుకోతగ్గ విషయం. వీనులవిందైన సంగీతం, చక్కని ఛాయాగ్రహణం చిత్రానికి మరింత వన్నె తెచ్చాయి. —మాధవ్

## హిందీ సినిమా వార్తలు

### సపనోంకా సౌదాగర్

స్క్రీన్‌జెమ్స్ బేనర్‌లో శ్రీ బి. అనంతస్వామి సమర్పించనున్న 'సపనోంకా సౌదాగర్' చిత్రం షూటింగ్ ప్రారంభమయింది. ఈ చిత్రంలో హేమమాలిని అను అందాలతారను నిర్మాత పరిచయం చేస్తున్నారు. కథానాయకుడు రాజకపూర్. ఇంకా జయంత్, సులోచన, దుర్గాఖోటే, అచలసచ్‌దేవ్, డేవిడ్, తనూజ మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి కథ—ఇందర్‌రాజ్ ఆనంద్ వ్రాశారు. సంభాషణలు, స్క్రీన్‌ప్లే—కె.ఏ. అబ్బాస్ వ్రాశారు. పాటలు—శైలేంద్ర హజరత్ కూర్చారు. శంకర్ జైకిషన్ యీ చిత్ర సంగీత దర్శకులు. నిర్మాత—బి. అనంతస్వామి. దర్శకుడు—మహేష్‌కౌల్.

ఈచిత్రం పూర్తిగా ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మాణం జరుగుతుంది.

### 'శ్రీ మాన్ ఫంటూష్'

ఎస్. బి. ప్రొడక్షన్సువారు నిర్మించిన 'శ్రీమాన్ ఫంటూష్' చిత్రంలో కిశోర్ కుమార్, ఆశాలత, కుంకుం, జీవన్‌కళ, అనూప్‌కుమార్, బేబి యస్మిన్ మున్నగువారు నటించారు. శ్రీరామకృష్ణా ఫిలిమ్స్ ద్వారా ఆంధ్రలో విడుదల కానున్న యీ చిత్రానికి దర్శకుడు—శాంతిలాల్‌సోనీ, సంగీత దర్శకత్వం—లక్ష్మీకాంత్. ప్యారేలాల్,



ఆత్మా ఆర్ట్స్ నిర్మిస్తున్న 'చిలకా గోరింకా' చిత్రంలో హిందీ నటి నూతన్ తెలుగు పాటను పాడినప్పటి చిత్రం. ఆమెకు ఇరువైపులవున్న స్వర రచయిత శ్రీశ్రీ, స్వరకల్పనచేసిన రాజేశ్వరరావు.

## బెంగాలీ చిత్రంలో వైజయంతీమాల

శ్రీ అరవిందదత్తా బెంగాలీలో నిర్మించబోయే చిత్రంలో కథానాయికగా సుప్రసిద్ధ దక్షిణాది తార వైజయంతిమాల నటిస్తుంది. శ్రీ తపన్‌సిన్హా యీ చిత్రానికి దర్శకత్వం చేస్తారు.

## భీ గీ రా త్

మాయా మూవీటోన్‌వారి 'భీగీరాత్' పూర్తి అయింది. త్వరలోనే ఆంధ్రలో విడుదల కాబోతుంది. ఈ చిత్రంలో అశోక్ కుమార్, ప్రదీప్‌కుమార్, మీనాకుమారి ప్రధాన పాత్రలు ధరించారు. ఇంకా యీ చిత్రంలో కామినికౌశల్, శశికళ, రాజేంద్రనాథ్, ఉల్హాస్, మరియు ఐ. యస్. జోహార్ మొదలగువారు నటించారు.

ఈ చిత్రానికి రమేష్‌పంత్ రచన, పాటలు—మజ్‌రూహ్ వ్రాశారు. సంగీతం—రోషన్. దర్శకత్వం—కాళిదాస్.

ఈ చిత్రం పూర్తిగా ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించబడింది. —ధర్మాజీ

## 'కాపురుష్-ఓ-మహాపురుష్' హిందీ అనువాదం

మొట్టమొదటిసారిగా సత్యజిత్‌రాయ్ నిర్మించిన చిత్రం 'కాపురుష్—ఓ—మహాపురుష్' హిందీలో అనువదింపబడి, రాజశ్రీ పిక్చర్స్, ద్వారా విడుదల కావటానికి సిద్ధంగా ఉంది.

సౌమిత్రా చటర్జీ, మాధవీ ముఖర్జీ, హరధన్ బెనర్జీలు యీ చిత్రంలో ప్రధాన భూమికలను పోషించారు.

## అవీ - యివీ...

సిండికేట్ బాంక్ మేనేజింగ్ డైరెక్టరుగా శ్రీ టి. ఎ. పాయ్ 1—1—66 న ఛార్జి తీసుకున్నారు. ఈయన 31-12-64 వరకు బాంక్ మేనేజింగ్ డైరెక్టర్‌గా పని చేసి, ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా మేనేజింగ్ డైరెక్టర్‌గా పనిచేయటానికి రాజీనామా చేసి వెళ్లారు. ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియాలో ఒక సంవత్సర కాలం పని చేసి కేంద్ర ప్రభుత్వం మరో మూడు సంవత్సరాలపాటు ఛైర్మన్‌గా ఉండమని కోరినా నిరాకరించి తిరిగి సిండికేట్‌బాంక్ మేనేజింగ్ డైరెక్టర్‌గా పని చేయటానికి వచ్చేశారు. 31—12—65 వ తేదీన మణిపాల్‌లోని బాంక్ ప్రధాన కార్యాలయంలో డైరెక్టర్లూ, యితర ఉద్యోగులూ శ్రీ పాయికి ఘనంగా స్వాగతమిచ్చి, ఆయన తిరిగి మేనేజింగ్ డైరెక్టర్‌గా వచ్చినందుకు తమ హర్షాన్ని వెలిబుచ్చారు.



పూనా ఆంధ్రా ఎసోసియేషన్ రజతోత్సవ సందర్భంలో నాటకాల పోటీలో బహుమతి పొందిన వి. విశ్వనాథ్ శ్రీమతి రామనమ్మగారివద్ద బహుమతి పుచ్చుకుంటున్న దృశ్యం.

# స్నేహప్రభా ప్రధాన్

1940లో బొంబాయిలోని గ్రాంట్ మెడికల్ కాలేజి వార్షికోత్సవాల సందర్భంలో మరాఠీ నాటక ప్రదర్శనం ఒకటి జరిగింది. అందులో ఆ కాలేజి విద్యార్థినొకామె ప్రముఖ పాత్ర నొకదాన్ని సమర్థవంతంగా పోషించి ప్రేక్షకుల మన్నన అందుకుంది. నటనావిషయంలోనే గాక, నాట్యంలో ఆమె ప్రదర్శించిన నేర్పు, గాత్రంలోని మాధుర్యము నలుగురినీ ఆకర్షించాయి. క్రమ క్రమంగా నాట్య ప్రదర్శనా లివ్వమనికోరుతూ ఆమెకు ఆహ్వానాలు రావటం ప్రారంభించాయి. కొంత కాలం తర్వాత నవేయుంగ్ ఫిలిం కంపెనీవారు ఒక మరాటీ చిత్రంలో



స్నేహప్రభా ప్రధాన్

నటించటానికి అవకాశాన్ని కల్పించారు. ఆ చిత్రంలో నటించటానికిగాను స్నేహప్రభా ప్రధాన్ తన చదువును ఒక సంవత్సరం వాయిదా వేసింది. ఆమె ఆ చిత్రంలో చూపిన ప్రతిభ, నటనా చాతుర్యం గుర్తించిన ఆ చిత్ర నిర్మాణ సంస్థవారు ఆమెతో తాము తయారుచేసే హిందీ, మరాఠీ, చిత్రాల్లో నటించటానికి దీర్ఘకాలిక ఒప్పందాన్ని కుదుర్చుకున్నారు. దీంతో చదువు పూర్తిగా మూలబడి స్నేహప్రభా ప్రధాన్ కళాసేవకే అంకితమైపోయింది.

ఆ చిత్ర నిర్మాణ సంస్థ తయారు చేసిన చిత్రాలలో స్నేహప్రభా ప్రధాన్ ప్రధాన భూమికలను పోషించి కొద్దికాలంలోనేఆనాటి ప్రముఖ తారలలో ఒకర్తైంది. ఆమె జీవితంలో ముఖ్యంగా గమనించదగ్గది ఒకటి ఉంది. 1944 లో ఒక చిత్రానికి ఇంగ్లీషు నవల 'ప్రైడ్ అండ్ ప్రెజుడిస్' ఆధారంగా ఆమె స్క్రీన్‌ప్లే వ్రాసింది. అదే చిత్రంలో నాయికపాత్రను పోషించింది.

అలా ఒక చిత్రానికి స్క్రీన్‌ప్లే వ్రాసి, అదే చిత్రంలో నాయికగా నటించిన నటి, ఒక్క స్నేహప్రభాప్రధానే అనవచ్చు. ●

## వరుసగా మూడు తరాలకు సంక్రమించిన నటనా వృత్తి

మహారాష్ట్ర బాంకింగ్ వ్యాపారంలో డాక్టర్ షిలోత్రి పేరు పొందిన వ్యక్తి. ఆ కాలంలో ఆయన పేరు ప్రఖ్యాతులు నాలుగు దిశలా వ్యాపించాయి. ఆయన అమెరికా విశ్వవిద్యాలయంలో బాంకింగ్ విషయాలను ప్రత్యేకంగా చదివి ఇండియా వచ్చి 1920లో స్వంతంగా తన పేరు మీద వో బాంక్‌ని స్థాపించాడు. పూనాలో అలా స్థాపించబడిన షిలోత్రి బాంక్ ఏ కారణం వల్లనో 1925లో తీవ్ర నష్టానికి గురి అయింది. దాంతో బాంక్ దివాలా తీసింది. తర్వాత కొంతకాలం డాక్టర్ షిలోత్రి భయంకరమైన దారిద్ర్యాన్ననుభవించి,1930లో చనిపోయాడు. ఆయన చనిపోయేప్పటికి నడివయస్సులోనున్న ఆయన భార్య 1943లో వో మరాటీ చిత్రంలో ఒక పాత్రను పోషించింది. అంతే ఆ తర్వాత మళ్లీ ఆమె తెరమీద కన్పించలేదు. కానీ ఆమె కుమార్తె శోభన చిత్రరంగంలో ప్రవేశించి కొద్దికాలంలోనే దేశంలోని పెద్ద నటీమణుల్లో ఒకరుగా పేరు పొందింది. ఆమె నటించిన చిత్రాలకు దర్శకత్వం వహించిన శ్రీ సమర్థ్‌ని వివాహం చేసుకుంది. శ్రీమతి శోభనా సమర్థ్ కుమార్తె నూతన్ 1952లో చిత్రరంగంలో ప్రవేశించి ప్రస్తుతం దేశంలోని అగ్రశ్రేణి తారలలో ఒకరుగా పేరు తెచ్చుకున్నది.

ఒకే కుటుంబంలో వరుసగా మూడు తరాలకు నటనా వృత్తి సంక్రమించటానికి ఉదాహరణ భారతదేశంలో యిదొక్కటే అనవచ్చు.

—వి. ఎస్. నక్షత్రంకర్. ●



ఎక్కువ ఖ్యాతి సార్జించుకున్నారని చెప్ప వచ్చు.

విజ్ఞాన శాస్త్రంలో పట్టభద్రులైన శ్రీ ఎస్. వి. రంగారావు కాలేజీలో చదివే రోజుల్లో సరదాగా పాటలు పాడుతూ ఉండేవారట. మిత్రులంతా చుట్టూ చేరి ఆయన గాత్రం పంకజ్ మల్లిక్ గాత్రంలా ఉందని మెచ్చుకుంటూ మరీ మరీ కోరి పాటలు పాడించుకునేవారట. ఓ సందర్భంలో ఆయన స్నేహితులతో కబుర్లు చెప్తూ 'నాకు సైగల్, పంకజ్ మల్లిక్ అంటే ఇష్టం' అని అన్నారట. ఫొటోగ్రఫీపై ఆసక్తి ఎక్కువ. స్నాప్ షాట్స్ చిత్రీకరించటం ఆయన సరదా. ఛాయాగ్రహణం విషయం ఆయనకి క్షుణ్ణంగా తెలుసు. తెలుగు, తమిళ చిత్రరంగాల్లో కారెక్టర్ యాక్టర్‌గా పేరు పొందిన వీరు హిందీ 'పాతాళభైరవి' ద్వారా ఉత్తరాది వారల అభిమానాన్ని కూడా చూరగొన్నారు. ప్రస్తుతం 'స్త్రీ ఓక్మే హా' చిత్రంలో కొత్త తరహా పాత్రని పోషించి ఉత్తరాది ప్రేక్షకులకు తమ నటనలోని వైవిధ్యాన్ని వెల్లడించబోతున్నారు.

'నర్తనశాల' జకార్తా చలన చిత్రోత్సవాలకు వెళ్ళినప్పుడు అందులో ఉత్తమ నటునిగా ఎన్నికయ్యారు. నటజీవితంలో బల మైన పాత్రలను పోషించే ఈయన నిజ జీవితంలో వినమ్రతతో అభిమానులకు

# ప్రతిభగల నటుడు ఎస్. వి. రంగారావు

తెలుగు, తమిళ చిత్రరంగాల్లో విభిన్న ప్రకృతులు గల పాత్రలను అవలీలగా, సమర్థవంతంగా పోషించి అఖండ ఖ్యాతి సార్జించుకున్న నటులు శ్రీ ఎస్. వి. రంగారావు. ఆయన నటన చూసిన ప్రతి ఒక్కరికీ ఆయన పోషించిన పాత్రను వేరొకరు అంత సమర్థవంతంగా పోషించగలరా అన్పించటం సహజం. సంభాషణలను చెప్పటంలో ఈయన తనదన్న ఒక ప్రత్యేక పద్ధతిని అనుసరిస్తారు. అందువల్ల ఎంతపెద్ద సంభాషణైనా ప్రేక్షకునికి సులభగ్రాహ్య మవుతుంది. తమిళ దేశంలో కూడా ఈయన నటనకి మంచి పేరుంది. ఆమాటకొస్తే తెలుగుతో పాటు తమిళంలోనే ఈయన స్వగతం యిస్తారు. సరదాగా కబుర్లు చెప్తే ఈయన్ని చూస్తుంటే 'పాతాళభైరవి మాంత్రికు డీయనేనా' అన్పిస్తుంది. ఏ తరహా పాత్రనైనా నేర్పుతో పోషించి తనకు తనే సాటి అన్పించుకున్న నటుడు శ్రీ రంగారావు.

—మాధవ్

# ప్రాణభయం



ఎవరో అడవి బాతుని వేటాడి తెచ్చి తైమూరుకి ఇచ్చారు.

"దీనిని వంటవాడి కిచ్చి, దోరగా వేయించి, తెప్పించు" అని రాజు దగ్గర ఉన్న మౌల్వీ నసీరుద్దీన్‌కి పురమాయించాడు.

బాతు వేపుడు తయారైంది. దానిని పళ్లెంలో పెట్టుకుని రాజుగారి దగ్గరకు తీసుకు వస్తున్నాడు మౌల్వీ అది ఘుమఘుమలాడి పోతోంది. దానిని చూస్తున్న మౌల్వీకి నోరు ఊరిపోతోంది ఇక భరించలేక బొడ్డులోంచి బాకు తీసి, ఒక కాలు కోసుకుని తినేశాడు. మిగిలినది అంతా ఏమీ ఎరగనట్లు తైమూర్‌కి తెచ్చి యిచ్చాడు.

"ప్రభువులు ఆరగించండి!"

పళ్లెంలో ఉన్న బాతుకి ఒకటే కాలు ఉండడం తైమూర్ గమనించాడు.

"రెండోకాలు ఏమైంది?"

"రెండో కాలు ఏమిటి దేవర! బాతులకి ఒకటే కాలు ఉంటుంది" అన్నాడు మౌల్వీ తడుముకోకుండా.

"అబద్ధాలు కట్టిపెట్టు. ఒక్కటేకాలు ఉండే బాతులను నే నెక్కడా చూడలేదు."

"నేను చూశాను ప్రభూ! మీమీద ఒట్టు!" అన్నాడు మౌల్వీ.

తైమూర్‌కి పట్టరాని కోపం వచ్చింది.




మౌల్వీ వినోదం గ్రహించాడు. కిటికీ తలుపులు బయటికి చూశాడు. అల్లంత దూరాన సరస్సు ఒడ్డున ఎండలో ఒంటి కాలిమీద నిలుచుని రెక్కలు ఆరబెట్టుకుంటున్న బాతులు కనిపించాయి.

"ప్రభువులు నామాట నమ్మరు కాదు. అదిగో చూడండి. ఆ బాతులకు ఒక్కటే కాలు ఉందో లేదో" అన్నాడు మౌల్వీ.

రాజుకి మౌల్వీ కొంటెతనం అర్థం అయింది. వెంటనే విల్లు అందుకుని, వాటిమీదికి బాణం వదిలేడు. ఆ అడవి బాతులు భయంతో "క్వాక్ క్వాక్" అంటూ నలుదిక్కులకూ ఎగిరిపోయాయి. ఆ ఎగరడంలో అంతకుముందు ముడిచి పెట్టుకుని ఉన్న రెండవకాలు కూడా బయటపడి కనిపించింది.

"ఇప్పుడేమంటావు? బాతులకు రెండేసి కాళ్లు ఉన్నాయంటావా?"

మౌల్వీ శాంతంగా సమాధానం ఇచ్చాడు.

"విల్లు ఎక్కుపెట్టి బాణంవేసి చంపుతానని భయపెడితే మీకు కూడా నాలుగు కాళ్లు వస్తాయి. ప్రాణభయంచేత బాతులకు రెండేసికాళ్లు రావడంలో ఆశ్చర్యం ఏముంది?"

## చక్కిలిగింతలు

మౌల్వీ నసీరుద్దీన్ ధైర్యం పరీక్షిద్దామని తైమూరుకి కోరిక కలిగింది. ఏదో స్వల్ప విషయానికి కొండంత కోపం తెచ్చుకుని "మౌల్వీని తక్షణం ఉరి తీయండి!" అని గర్జించాడు.

భటులు మౌల్వీని ఉరిస్తంభం దగ్గరకు తీసుకుపోయారు. మౌల్వీ నోరు మెదపలేదు. ఉరితాడు మెడకి తగిలించబోతూ ఉండగా రాజు వచ్చాడు.

"ఈ ఆఖరు సమయంలో నువ్వు చెప్పుకోవలసిన దేమైనా ఉందా?"

"చిన్న మనవి" అన్నాడు మౌల్వీ.

"ఏమిటది?"

"నా మెడ ఎవరైనా ముట్టుకుంటే నాకు చక్కిలిగింతలు. వాటిని నేను భరించలేను. కనుక మెడకి బదులుగా నా నడుముకి ఉచ్చువేసి నన్ను ఉరితీయించండి. నాలు!"

# పుస్తకాలు

## మగ్ర ఆంధ్ర సాహిత్యం

శ్రీ ఆరుద్ర రచన. ఎనిమిదవ సంపుటం, నవా ల యుగం. క్రౌను 280 పుటలు. వెల 5 రూ. కాశకులు ఎం. శేషాచలం అండ్ కంపెనీ, ద్రాసు, మచిలీపట్నణం, సికిందరాబాదు.

అపూర్వ పరిశోధనలు చేస్తూ ఆరుద్రగారు రుస్తున్న సాహిత్య చరిత్ర సంపుటాలలో ఇది మిదవది. రాయల మరణంతో క్షీణదశకు వచ్చిన యనగర రాజ్య కాలంలోని సాహిత్య చరిత్ర త్వాత మహమ్మదీయ పాలకుల కాలంలో వెలసిన హిత్య చరిత్ర ఇందులో ఈయబడినవి. నలభై ందికి పైచిలుకు కవులను గూర్చిన విషయాలు వై రెండు ప్రకరణాలలో ఉన్నవి. రవూరవి ష్టశతాబ్దికి పైగా ఉన్నకాలంలో వెలువడిన ంధ్ర సాహిత్య సమీక్ష యీ సంపుటంలో జరుప ంది.

ఇందులో ఏభై పుటలు తెనాలి రామకృష్ణ కే ప్రత్యేకించ బడినవి. తర్వాతి స్థానం పింగళి రన్నది. తర్వాతి వాడు రామరాజ భూషణుడు, మకృష్ణ కవి రచనల గురించి, వాటి కథాంశా ను గురించి కృతి పతులను గూర్చి రచనా చమ త్కారాలను గురించి చక్కని పరిశీలన యిందులో న్నది. 41 వ పుటలో ఉన్న రామకృష్ణుని టువు "ఒకని కవిత్వమందెనయు—" అనే దానిలో ప్పులు తప్పులు' అనేదానికి బదులు "తప్పులు ప్పులు" అని పడినది. దాని మూడవ పాదంలో ుక్కలు వోవ' అనివుంది. 'మొుక్కలు వోవ' అని ండవలెను. పరాభవం పొందడం దాని అర్థం. ఒక ాయసం ఉద్యోగిఅయిన వేదాద్రిమంత్రికి పాండు ంగ కృతిని రామకృష్ణుడు అంకిత మివ్వడం వింతగా న్నట్లు ఆరుద్రగారు సూచించారు. రామకృష్ణుని తులను స్వీకరించినవారు సామాన్యులగుట, అతని విత్త నిరపేక్షతను వ్యక్తం చేస్తుంది. భక్తి, మైత్రి ముఖ్యంగాని, అతనికి ధనం ముఖ్యంకాదు. అతడు రాయుల వంటివారిని కూడా లెక్కచేయలేదనే కథలు ఈ విషయాన్నే తెలియ జేస్తాయి.

శంకర కవిని గురించి చెప్తున్నప్పుడు హరిశ్చంద్ర కథల వివరణ, తారతమ్యాలు, శంకరకవి రచనా వైశి ష్ట్యం సమగ్రంగా చూపబడినవి.

వెలగ పూడివెంకన్న కృష్ణకర్ణామృతంలో చక్కని మూలశ్లోకాలూ, వాటికి సరియైన ఆంధ్రానువాద పద్యాలు చూపబడినవి.

కానుకొలను అన్నమరాజునూ, అతని అమరుక కావ్యాన్ని గురించి వ్రాస్తూ ఆరుద్రగారు అమరు కాన్ని మొదట తెలిగించినవాడు అన్నమరాజే అని అభిప్రాయ పడ్డారు. (చూ. పుట 102) కాని దీనిని మొదట తెలిగించినది తాళ్ళపాక తిరువెంగళప్ప అని, ఆ అనువాదాన్ని పీఠికతో కూడా ప్రకటించిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వెల్లడించారు. (చూ. Journal of Sri Venkateswara Oriental Institute, Tirupati 1949.)

అయ్యలరాజు రామభద్రుణ్ణి గురించి వ్రాసే టప్పుడు అతని రామాభ్యుదయంలోని కథా సంవిధాన మునూ, రచనా చమత్కృతిని ఆరుద్రగారు చక్కగా నిరూపించారు. పాత్రపోషణలో కవి తగిన శ్రద్ధ తీసు కోలేదని ఉదాహరణలతో నిరూపించారు. ముని బాలుణ్ణి చంపిన దశరథుడు 'తనవల్ల యింతదారుణం జరిగిందే' అని బాధ పడడు, పైగా సంతోషిస్తాడు' అని విమర్శించారు. కాని దశరథుడికి విచారం లేక పోలేదు. తనకు యిప్పటివరకు పుత్రులు కలుగలేదు. ఇక కలుగుతారనే ఆశకూడాలేదు. 'పుత్రశోకంవల్ల నీకు మరణం కలుగుతుంది' అనే ముని శాపంవల్ల, తనకు పుత్రులు కలుగు తారనే గొప్ప సంతోషం దశ రథుడికి కలిగింది. అలా సంతోషం కలగడంవల్ల యీశోకం తగ్గిపోయింది. ఈవిషయాన్నే రామ భద్రుడు "పుత్రసంతాన కారణంబగు తాపసగోపం బమోఘంబని యంతరంగంబున శోకంబు లెక్కింపక పరమ సంతోషభర మగ్నుండయి మరలి పోవుచు" అని తెలియజేశాడు. ఇట్టి భావాలు కలగడం స్వాభావికమే!

కందుకూరి రుద్రకవిని గురించిన 17వ ప్రక రణంలో ఆపేరుగల ముగ్గురు రుద్రకవులను గురించి వివరణం విపులంగా ఉన్నది. మల్కిభరాం కాలంలో ఉండిన రుద్రకవే నిరంకుశోపాఖ్యానమనే శృంగార కావ్యం చెప్పినాడని నిరూపించ బడింది. ఆ కథ విపు లంగా విమర్శించబడింది. వందెంలో గెల్చిన నిరం కుశుడు శివుని "గళంబునన్, బొగడ దండ యొనర్చె" నని చెప్తున్నపుడు అది శిక్షా సాధనమై వుంటుం దని సూచిస్తూ ఆరుద్ర గారు 177 పుట అధో సూచికలో, సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్రలో వ్రాసిన "కవిరాజుకంఠంబు కౌగిలించెనుగదా పురవీధి నెదురెండ పొగడదండ" అని శ్రీనాథుడు చెప్పిన చాటువులోని పొగడదండ అప్పులున్న వాళ్ళకు వేసే ఇనుపసంకెళ్ళో, తాళ్ళో అని చెప్పాలి అనేదాన్ని ఇచ్చారు. కాని, శ్రీనాథుడు చెప్పినది బొగడదండ కాని, పొగడదండకాదనీ, అది ఇనుప బొగడలతో కూడిన శిక్షాసాధనమైన— మెడలో వేసే దండ అని 1936—వ సం. డిసెం బరునెల భారతి సంచికలో 'పొగడదండ'' అనే వ్యాసం లో శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు వివరించి ఉన్నారు. పద్యాల్లో కాన వస్తున్న 'బొగడ దండ' లోని ప్రథమాక్షరం స్వాభావికంగా పరు షమేకాని పరుషానికి ఆదేశంగా వచ్చిన సరళంకాదు.

ఇందులో తెనాలి రామకృష్ణుని తర్వాత విపు లంగా విమర్శించబడినకవి పింగళి సూరన్న. ఇతన్ని గురించి నలభై పేజీలకు పైగా ఉన్నది. ఇందు కవిని గురించి, ద్వ్యర్థి, త్ర్యర్థి కావ్యాలను గురించీ విపులంగా చెప్పబడినది. సూరన్న చెప్పిన శ్లేషభేదా లన్నింటికీ అతని రాఘవపాండవీయం మంచి ఉదా హరణలు ఇయ్యబడినవి. ఎంతో ఓపికతో కథా

—SWASTIK

## పుస్తకాలు

పూర్ణోదయం లోని కథ అయిదాశ్వాసాల లోనూ సంగ్రహంగా చెప్ప బడింది. ప్రభావతీప్రద్యుమ్నంలో శుచిముఖి పాత్ర విశిష్టతా, కవితా పద్ధతులూ విశదీకరించ బడినవి. సూరన్న కవితా విశిష్టతను సులభంగా తెలుసుకొనుటకు ఈ ప్రకరణం మిక్కిలి ఉపయోగిస్తుంది.

రామరాజభూషణుని గురించిన ప్రకరణంలో అతని జీవిత చరిత్రకు సంబంధించిన అనేక విషయాలు వున్నవి. రామరాజ భూషణుడు రాయల వారికాలంలో ఉండుట అసంభవమని సయుక్తికంగా ఇందులో చూపబడినది వసుచరిత్రలోని కవితా రీతులు వివరించ బడినవి. వసుచరిత్ర రచనానంతరం రాఘవ పాండవీయం రచింప బడినట్లు స్పష్టం చేయబడినది.

నవాబుల యుగంలో కుతుబ్‌శాహీ కాలంలో ఉండిన మరింగంటి సింగరాచార్యుల ప్రతిభ 20—వ ప్రకరణంలో వివరించబడింది. ఈ కవి దశరథ రాజ నందన చరిత్రాన్ని నిరోష్ఠ్యకావ్యంగా అయిదు ఆశ్వాసాలలో కూర్చాడు. విజయనగర ప్రభువు వల్ల కవిసార్వభౌమ బిరుదం పొందాడు. ఇరవై గ్రంథాలను వ్రాశాడట. వీటిలో రెండుమాత్రమే ముద్రితమైనవి. ఆరెండున్నూ నిరోష్ఠ్యాలే! ఈ విద్వత్కవి ప్రతిభా పాండిత్యాలను తెలుసుకొనుటకు, అతనిని గూర్చిన ప్రకరణం సహకరిస్తున్నది.

పుస్తకం చివర ముగ్గురు లాక్షణిక కవులను గురించీ, పన్నెండుగురు వేదాంత కవులను గురించీ సంగ్రహమైన చరిత్రలు రెండు ప్రకరణాలలో ఈయబడినవి. ఇదివరకు వాఙ్మయ చరిత్రకారులు తెలుపని విషయాలనూ, గ్రంథములలోని విషయాలనూ సంగ్రహంగా నయనాచూపి, వాఙ్మయాభిమానులకు ఉపకారం చేస్తున్న రచయిత పూనిక ప్రశంసించ దగినది.

—ఆంగీరస

### ఆత్మబోధ

శ్రీ తాడిమళ్ల జగన్నాథస్వామి రచించిన 'శ్రీ శంకర భాగవత్పాదుల 'ఆత్మబోధ' మా కార్యాలయం చేరింది. ఇందు సోదాహరణముగా చక్కని శైలిలో ఆత్మ జ్ఞానము ప్రబోధింపబడినది. మూల్యం : 50 పైసలు. ప్రతులకు : శ్రీ నరసమాంబా పఠనాలయం, "రాంనగర్" భీమవరం, ప. గోదావరిజిల్లా.

### శిక్షార్హులు

శ్రీ కొప్పుల వసంతరావు రచించిన "శిక్షార్హులు" సాంఘిక నాటకం మా కార్యాలయం చేరినది. 79 పేజీలు వెల : రెండు రూపాయలు. ప్రతులకు : శ్రీ పద్మావతీ పబ్లికేషన్స్, 339, గిడ్డంగివీధి, నెల్లూరు.

### మహారథికర్ణ

శ్రీ సోంపల్లి బాపయ్య రచించిన 'మహారథికర్ణ' (ఐదు ఏకపాత్రాభినయ నాటికలు) మా కార్యాలయం చేరినది. 43 పేజీలు. వెల : రూపాయి ఇరవై అయిదు పైసలు. ప్రతులకు : ఉదయ సాహితీ పబ్లికేషన్స్, విజయవాడ—1.


Edited Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press: 6&7Thambu chetty Street

